# చందమామ

సంపుటి 103 సెప్టెంబర్ 2000 సంచిక 3



## ఈ సంచికలో...

### కథలు

ఇద్దరు రాకుమారులు (బే.క) పేజినం.09
గానుగెద్దు-గంగిరెద్దు పేజినం.15
స్నేహంవల్ల లాభం! పేజినం.26
దొంగ-ఆత్మగౌరవం పేజినం.43
పెళ్ళిసమస్య పేజినం.48
పట్టినది బంగారం పేజినం.64

### జానపద సీరియల్

స్వర్ణసింహాసనం-10 పేజినం.19

### పౌరాణిక సీరియల్

మహాభారతం-56 పేజినం.57

### చారిత్రక విశేషాలు

ఓహో... ఒలింపిక్స్ (కామిక్స్) పేజినం.27
భారత సంస్కృతి - చరిత్ర - 9 పేజినం.52

### శీర్షికలు

చందమామ కబుర్లు పేజినం.06
ఈ నెలలో జన్మించిన ప్రముఖులు పేజినం.47
భారతదర్శనం పాఠకులకు క్విజ్ పేజినం.56

### పోటీలు

బాలరచయితలకూ, చిత్రకారులకూ ఆహ్వానం! పేజినం.08
సృజనాత్మక పోటీ పేజినం.18
ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీనం. 66

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

## ఈ నెల విశేషాలు



ఓహో... ఒలింపిక్స్ (కామిక్స్)

ఇద్దరు రాకుమారులు (బేతాళ కథలు)



దొంగ-ఆత్మగౌరవం



భారత సంస్కృతి చరిత్ర



దూర తీరాల్లో వున్న

## మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారిభాషల్లో

వారితో మాట్లాడే

చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ
మలయాళం,మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకు
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు

పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా

పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI–600 026

సంపాదకుడు

విశ్వం

ఉత్తర ప్రత్యుత్తరాలకు:

చందమామ మేగజైన్ డివిజన్

చందమామ బిల్డింగ్స్

వడపళని, చెన్నయ్– 600 026

ఫోన్/ఫ్యాక్స్: 4841778

4842087

ఇ. మెయిల్: Chandamama@ vsn lcom

ముంబాయి కార్యాలయం

2/B, నాజ్ బిల్డింగ్స్

లామింగ్‌టన్ రోడ్,

ముంబాయి–400 004

ఫోన్ : 022–388 7480

ఫ్యాక్స్: 022–388 9670

అమెరికాలో

విడికాపీ $2

సంవత్సర చందా $20

సొమ్ము పంపవలసిన చిరునామా:

ఇండియా అబ్రాడ్

43 వెస్ట్ 24 స్ట్రీట్

న్యూయార్క్ ఎన్.వై 10010

ఫోన్: (212) 929-1727

ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# ఒలింపిక్ స్ఫూర్తి!

నవసహస్రాబ్దిలో జరుగనున్న తొలి ఒలింపిక్ క్రీడలను వీక్షించడానికి ప్రపంచం ఉత్సాహంగా ఆయత్తమవుతోంది!

క్రీడలు, ఆటలు, పందాలు అన్నవి మానవ సమాజం అంత ప్రాచీనమైనవి. మహాభారతం వంటి పురాతన గ్రంథాలలో సైతం రకరకాల క్రీడల ప్రస్తావన ఉన్నది. ఇక చారిత్రకదృష్టితో పరిశీలించినట్టయితే, గ్రీసుదేశంలోని ఏథెన్స్ నగరంలో క్రీ.పూ.776వ సం॥ లోనే ప్రప్రథమంగా పెద్ద ఎత్తున క్రీడలు జరిగాయని తెలియవస్తున్నది. క్రీ.పూ. 776 నుంచి క్రీ.శ. 217 వ సం॥ మధ్య కాలంలో ఒలింపిక్ విజేతలుగా వచ్చిన క్రీడాకారుల (ఆ కాలంలో స్త్రీలను క్రీడలలో అనుమతించేవారుకారు గనక క్రీడాకారిణులు లేరు) జాబితాను క్రీ.శ.221వ సం॥లో జూలియస్ ఆఫ్రికానస్ తయారుచేశాడు!

జీయస్ ఆలయం ఒలింపియా పేరు మీదుగా ఏర్పాటయిన ఒలింపిక్ క్రీడలు పవిత్రకృత్యాలుగా ప్రారంభమయ్యాయి. మానవశరీరం-శక్తి దైవప్రసాదితాలు. వాటి ద్వారా సాధించే ఉత్తమ విన్యాసాలను ప్రదర్శించడం దైవానికి కానుకగా సమర్పించడం వంటిదన్న భావం ఉండేది. విజేతలకు ఆలివ్ పత్రగుచ్ఛాలనే బహుమతులుగా ఇచ్చేవారు! విజేతలను ప్రజలు అభిమానించేవారేగాని, వారిపట్ల నిర్హేతుకమైన వెర్రివ్యామోహం పెంచుకునేవారు కారు. అప్పటి క్రీడాకారుల స్ఫూర్తిని గురించి చెబుతూ 20వ శతాబ్దానికి చెందిన గ్రాంట్‌లాండ్ రైస్ అనే కవి, "మీరు గెలిచారా? ఓడారా? అన్నది కాదు. ఆటను ఎలా ఆడారు అన్నదే న్యాయనిర్ణేత లెక్కలోకి తీసుకుంటాడు," అన్నాడు. దేవుడే ఆ న్యాయనిర్ణేత!

చాలా సంవత్సరాలు కృషి చేసి ఫ్రాన్స్‌కు చెందిన బేరోన్ డీ క్యూబెర్టీన్ 1896లో ఒలింపిక్ క్రీడలను పునఃప్రారంభించినప్పుడు ప్రపంచవ్యాప్తంగా క్రీడలపట్ల ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. క్రీడల గురించీ, క్రీడాస్ఫూర్తిని గురించీ ప్రజలు మాట్లాడుకోసాగారు. పోటీలలో పాల్గొనే క్రీడాకారులు చేసే ప్రమాణంలోనే ఇది ప్రస్ఫుటమవుతున్నది : "మేము నిజాయితీగా క్రీడలలో పాల్గొంటాము. క్రీడాకారుడి నిజమైన స్ఫూర్తితో, క్రీడల కీర్తి పెంపొందడానికి దోహదం చేసేలా క్రీడలలో పాల్గొంటాము."



# చందమామ కబుర్లు

## విమానయానం - బహుమతి!



ఈ యేడాది మెట్రిక్యులేషన్ పరీక్షా ఫలితాలు వెలువడినప్పుడు చెన్నయ్ నగర సమీపంలోని ఒక మెట్రిక్యులేషన్ స్కూలు విద్యార్థులూ, ఉపాధ్యాయులూ ఎంతో సంబరపడిపోయారు. ఎందుకంటే - ఆ స్కూలుకు చెందిన బృంద, ప్రవీణ అనే విద్యార్థినులు రాష్ట్రస్థాయి ర్యాంకులు సాధించారు. వారికి నగదు బహుమతులూ, పై చదువులకు ఉపకారవేతనాలూ మంజూరు చేశారు. బావుంది! అంతటితో ఆగకుండా ఆ పాఠశాల యాజమాన్యం ఒక అడుగు ముందుకు వేసి - ఆ విద్యార్థినులకు ఎయిర్ టికెట్ ఇచ్చి హైదరాబాదుకు విమానంలో పంపడానికి నిశ్చయించింది. గ్రామ ప్రాంతానికి చెందిన ఆ విద్యార్థినులు విమాన ప్రయాణం చేసి వచ్చినట్టయితే నగర విద్యార్థులతో సరిసమానంగా పట్టణ జీవిత అనుభవం ఏర్పడుతుందన్నది పాఠశాల యాజమాన్యం ఉద్దేశం! అయినా నగర విద్యార్థులలో ఎంతమందికి విమానాల్లో ప్రయాణం చేసే అవకాశం ఉందన్నది పెద్దప్రశ్న! మరొక విషయం ఏమంటే - చుట్టూవున్న ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి - చారిత్రక ప్రదేశాలకూ, పర్యాటక కేంద్రాలకూ వెళ్ళిరావడంకన్నా విమాన ప్రయాణం ఎక్కువ ఉపయోగ పడుతుందా అని ఆలోచించి చూడాలి. ఈనాడు చాలా పాఠశాలలు స్టేటు ర్యాంకులు సాధించే తమ విద్యార్థుల ఫోటోలను వివరాలతో ప్రచురించడానికి వార్తాపత్రికల పేజీలను పోటీపడి ఆక్రమిస్తున్నాయి. ఇంకా కొన్ని ట్యుటోరియల్ విద్యాసంస్థలు - ఒక్కసారి కూడా తమ విద్యాసంస్థలకేసి రాని విద్యార్థుల ఫోటోలను తమ విద్యార్థులంటూ ప్రచురించడం కూడా అప్పుడప్పుడు జరుగుతున్నది. వీటివల్ల లబ్ధి పొందేదెవరు? విద్యార్థులా? విద్యా సంస్థలా? ఆలోచించ వలసిన విషయం!

★★★★★

## మిత్రులయిన శత్రువులు!

డెన్మార్క్, స్వీడన్ దేశాలను కలుపుతూ నిర్మించిన 16 కి.మీ. పొడవైన వంతెనను జూలై 1వ తేదీ తెరవడంతో ఉభయదేశాల మధ్య గత 400 సంవత్సరాలుగా వున్న వైరం సమసిపోవడానికి మరొక అవకాశం లభించింది. 7000 సంవత్సరాలకు పూర్వం, అంటే మంచు యుగం విడదీయడానికి ముందు ఉభయప్రాంతాలు ఒకేభాగంగా ఉండేవి. వెయ్యేళ్ళక్రితం వాళ్ళు శత్రువులుగా మారారు. స్వీడన్ దక్షిణాగ్రమైన స్కానే గత 600 సంవత్సరాలుగా డెన్మార్క్ ఆధీనంలోనే ఉన్నది. దీనికోసం యుద్ధాలు జరిగాయి. ఆఖరికి 1658వ సం॥లో మళ్ళీ స్వీడన్‌లో అంతర్భాగమయింది. అయినప్పటికీ అక్కడి

## జాతీయ క్షమాపణ!



బ్యాంకాక్‌లోని ఒక టాక్సీడ్రైవర్ కూతురు పద్నాలుగేళ్ళ ఆయిషానవావీ. ఆమె జూన్‌నెలలో లాంకావీ అనే మలేషియా దీవికి చేరింది. ఆమె రాక శాపవిముక్తిని కలిగిస్తుందని అక్కడి ప్రజలు పలువురు ఆశించారు. 200 సంవత్సరాలకు పూర్వం థాయ్‌లాండ్ అందాలరాశి మసూరీ ఆ దీవిని శపించింది. ఆయిషా ఆమె వంశానికి చెందిన యువతి. థాయ్‌లాండ్‌లోని పుకెట్‌లో పుట్టిన మసూరీ, మెరుగైన బతుకు తెరువు వెతుక్కుంటూ మలేషియాలోని లాంకావీ చేరుకొని ఒక మలయా సైనికుణ్ణి వివాహమాడింది. కొన్నాళ్ళకు ఆమె భర్త యుద్ధానికి వెళ్ళాడు. మసూరీ అందాన్ని చూసి అసూయచెందిన గ్రామాధికారి భార్య ఆమె భర్తపట్ల విశ్వాసంగా లేదని నిందారోపణ చేసింది. ఆమెకు మరణ శిక్ష విధించి, దానికని నిర్దేశించిన కత్తితో పొడిచిచంపారు. ఆమె శీలవతి, నిరపరాధి అని నిరూపించడానికా అన్నట్టు ఆమె శరీరం నుంచి తెల్లటి నెత్తురు కారింది. మసూరీ మరణిస్తూ ఆ దీవిలో ఏడుతరాల వరకు ఆడపిల్లలే పుట్టరని శపించింది. ఆ తరవాత కొన్నాళ్ళకు సయాం (ఇప్పటి థాయ్‌లాండ్) మలేషియా మీద దండెత్తింది. మసూరీ ఏకైక సంతానమైన ఆమె కొడుకు, కుటుంబీకులు పుకెట్‌కు తిరిగివెళ్ళారు. ఇప్పుడు ఆయిషాకు మలేసియా ఘనస్వాగతం పలికింది. జాతీయ క్షమాపణలు చెప్పుకోవడంతో పాటు పౌరసత్వం, నివాసం, ఉద్యోగం కల్పించింది. ఆయిషా ఆ దీవిలోని మసూరీ సమాధిని దర్శించడానికి వెళ్ళినప్పుడు మూఢ విశ్వాసం గల పలువురు ప్రజలు ఆమెను చుట్టుముట్టారు!

*****

ప్రజలు తమ డెన్మార్క్ బాంధవ్యాన్ని మరిచిపోవడం లేదు. డెన్మార్క్‌ను కలుపుతూ వంతెన కావాలని ఒక శతాబ్దానికి పైగా పోరాడుతున్నారు. ఉభయ ప్రభుత్వాలూ అనేక సంవత్సరాలు నిదానంగా ఆలోచించాక ఒక ఒప్పందానికి వచ్చాయి. ఓరిసండ్ జలసంధి మీదుగా - దక్షిణాగ్ర స్వీడిష్ నగరమైన మాల్‌మూఫ్‌నూ; డెన్మార్క్ రాజధాని కోపెన్ హాగన్‌నూ (ఇక్కడే సుప్రసిద్ధ కథారచయిత హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్ నివసించాడు) కలుపుతూ నాలుగేళ్ళ క్రితం వంతెన నిర్మాణం ప్రారంభమయింది. వంతెన ప్రారంభోత్సవాన్ని చూడడానికి ఉభయ ప్రాంతాలలోనూ వేలాది మంది ప్రేక్షకులు ఉత్సాహంగా గుమిగూడారు.



# బాలరచయితలకూ, చిత్రకారులకూ ఆహ్వానం!



నవంబర్ 2000 చందమామ పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడనున్నది!

## పదహారేళ్ళలోపు బాలబాలికలకు అపూర్వ అవకాశం!

రచనలు : వెయ్యి పదాలకు మించకుండా చక్కని కథలను స్వయంగా ఆలోచించి రాసి, పేరుపెట్టి పంపండి. తెలుగు, తమిళం, హిందీ, మరాఠీ, ఒరియా, బెంగాలీ, ఇంగ్లీషు భాషలలో ఏ భాషలోనైనా సరే ఒక్కొక్కరు మూడు కథల వరకు పంపవచ్చు.

చిత్రాలు : సుప్రసిద్ధ పౌరాణిక దృశ్యాన్ని గాని, చారిత్రక ఘట్టాన్నిగాని (దానిని మాటలలో సూచించాలి) చిత్రంగా / వర్ణచిత్రంగా వేసి మాకు పంపాలి. వచ్చిన ఎంట్రీలలో ఉత్తమమైన వాటిని ఎంపికచేసి, వాటిని వేసి పంపిన బాల చిత్రకారులను దసరా సెలవులలో (మా ఖర్చులతో) చెన్నయ్‌కి రప్పించి, ప్రత్యేక సంచిక కోసం నిర్దేశించిన కథలకు వాళ్ళ చేత బొమ్మలు వేయిస్తాం.

ఎంట్రీలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ : 18 సెప్టెంబర్, 2000

**బహుమతులు :** ప్రతిభావంతమైన ప్రయత్నాలకు ఆకర్షణీయమైన బహుమతులు ఉంటాయి!

**హామీ పత్రం :** ఈ పోటీలో పాల్గొనే బాలబాలికలు కింది కూపన్‌లో తల్లి/తండ్రుల సంతకం తీసి పంపడం మరచిపోకండి.

పేరు ______________ వయసు / పుట్టిన తేది ______________

తరగతి ________ పాఠశాల ______________

ఇంటి చిరునామా ______________

______________

______________

పిన్ కోడ్ : ______________

ఎంట్రీల వివరాలు :

1. ______________
2. ______________
3. ______________



పైన కనబరచిన ఎంట్రీలు మా అబ్బాయి / అమ్మాయి మరెవ్వరి సాయం లేకుండా సొంతంగా రాసినవి / వేసినవి అని ధ్రువ పరుస్తున్నాను.

అబ్బాయి / అమ్మాయి సంతకం

తల్లి / తండ్రి సంతకం




# ఇద్దరు రాకుమారులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో, సాధించదలచిన దానికోసం, నానా శ్రమలకూ లోనవుతున్నా సడలని నీ పట్టుదల నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది. నీలాగే పట్టుదలా, స్థిరబుద్ధీగల ఇద్దరు రాకుమారులు ఆఖరి క్షణంలో తమ స్వార్థప్రయోజనాలకు లొంగిపోయి, తమ స్వభావాలకు విరుద్ధంగా ప్రవర్తించారు. నువ్వూ, ఏదో ఒకనాడు వాళ్ళలాగే ప్రవర్తించి నలుగురిలో



ఒకనాడు ఆమె చెలికత్తెలతో కలిసి వన విహారానికి వెళ్ళింది. ఆ సమయంలో కోయ గూడెంపెద్ద ఒకడు, జయంతికి ఒక తెల్ల అడవిగుర్రంపిల్లను కానుకగా ఇచ్చాడు.

ఆ అడవిగుర్రపుపిల్లకు యువరాణి అశ్వశాలలో, ఒక ప్రత్యేక స్థావరం ఏర్పాటు చేయించి, దానికి నీరు, మేతను తనే స్వయంగా పెట్టేది. రెండు సంవత్సరాలు గడిచేసరికి అది ఎత్తుగా, దృఢంగా పెరిగింది.

ఒకనాడు అశ్వశిక్షకుడు, తెల్లగుర్రానికి కళ్ళెం అవీ వేసి, యువరాణి దానిమీద స్వారీ చేసేందుకు సిద్ధం చేశాడు. పక్షం రోజులలో శిక్షణ పూర్తయింది. ఇప్పుడు, యువరాణి దానిమీద కూర్చుని అలా అదిలిస్తే చాలు, అది వాయువేగంతో పరిగెత్తేది.

ఇలావుండగా - అడవి ఏనుగులు రాత్రి వేళవచ్చి, సమీపగ్రామాల్లోని చెరుకు తోటలను ధ్వంసం చేస్తున్నాయని, గ్రామ వాసులు ప్రచండగిరి చక్రవర్తికి మొర పెట్టుకున్నారు.

చక్రవర్తి కుమారుడు యువరాజు రుద్ర కేతుడు, కొంతమందిభటుల్ని వెంటబెట్టుకుని అడవికి వెళ్ళాడు. చీకటి పడగానే భటులు కాగడాలు వెలిగించారు. చూస్తూండగానే, కొన్ని ఏనుగులు గుంపుగా గ్రామాలకేసి రాసాగాయి. కొందరు భటులు డప్పులు వాయిస్తూండగా, మరికొందరు వాడి బాణా లను గురిచేసి వాటిని కొట్టారు. ఈ గందర గోళానికి బెదిరిపోయి ఏనుగులు చెల్లా చెదురుగా తిరిగి అడవిలోకి పారిపోయాయి.

మర్నాటి ఉదయం రుద్రకేతుడూ, భటులూ అడవి దాపున వున్న శ్రీచందన

నవ్వులపాలు కాగలవేమో అన్న అనుమానం కలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా వుండేందుకు, వాళ్ళ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

ఇరుగుపొరుగున వున్న శ్రీచందన, ప్రణయపుర రాజ్యాల రాజులు, ప్రచండగిరి రాజుకు సామంతులు. శ్రీచందనపురాన్ని చంద్రదత్తుడనే రాజు పాలించేవాడు. ఆయనకు జయంతి అనే ఒక్కగా నొక్క కుమార్తె. ఆమెను మహారాజు, కొడుకులా పెంచి క్షత్రియోచిత విద్యలన్నీ నేర్పాడు. ఇప్పుడు యువరాణి యుక్తవయస్కు రాలైంది. సహజంగా ఆమె అద్భుత సౌందర్య రాశి, దానికి తోడు యవ్వనం తెచ్చిన నిగా రింపుతో జగదేకసుందరిలా కనిపించసాగింది.

పురానికి చేరుకున్నారు. రాజు చంద్రదత్తుడు అందరికీ ఘనంగా సత్కారం చేసి, తగు విధంగా విడిది ఏర్పాటు చేశాడు. ఆ సమయంలో రాకుమారి జయంతిని చూసిన రుద్రకేతుడు, పాలరాతి బొమ్మలా వున్న ఇటువంటి అందగత్తె తన పట్టమహిషి అయితే ఎంత బావుండును అనుకున్నాడు.

ఆ తరవాత కొంతసేపటికి రుద్రకేతుడు, అశ్వశాలలోని తెల్లగుర్రాన్ని చూస్తూనే, రాజు చంద్రదత్తుడితో, "ఆహా, గుర్రమంటే ఇలా వుండాలి! ఈ గుర్రం నాకు కావాలి," అన్నాడు.

అటుగావచ్చిన యువరాణి, ఆ మాటలు విని రుద్రకేతుడితో, " యువరాజా! గుర్రాన్ని తీసుకువెళ్ళండి. దీన్ని చిరుకానుకగా మీకు సమర్పించుకుంటున్నాం," అన్నది.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, నవరాత్రి ఉత్సవాలు వచ్చాయి. రాజు చంద్రదత్తుణ్ణి ఆహ్వానించడానికి ప్రణయపురి యువ రాజు వైభవవర్మ శ్రీచందనపురానికి వచ్చాడు. అతడు రావడానికి మరొక కారణం రాకుమారి జయంతి. అతడూ, జయంతీ ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకున్న సంగతి, ఇరు పక్షాల పెద్దలకూ తెలుసు.

ఆనాటి సాయంకాలం మాటల సంద ర్భంలో జయంతి, వైభవవర్మకు తన తెల్ల గుర్రాన్ని చక్రవర్తి కుమారుడు రుద్రకేతు తీసుకుపోవడం ఎంతో మనస్తాపం కలిగించిం దని చెప్పి, "అతడి దురుసుతనం, అహంకారం అంతాయింతా కాదు!" అన్నది.

" ఏంచేస్తాం, అతడు చక్రవర్తి కుమా రుడు, మనం సామంతులం! ఇక ఆ గుర్రం సంగతి మరిచిపో," అన్నాడు వైభవవర్మ.



ఆ మరుసటిరోజు వైభవవర్మ తన రాజ్యానికి తిరిగివెళ్ళాడు. ఆ సమయంలో పట్టణంలోని అతిపురాతనమైన దేవీ ఆలయానికి మర మ్మతులు జరుగుతున్నవి. పనివాళ్ళు ప్రాకా రపు గోడకు పునాదులు తవ్వుతూండగా, నీలం రంగులో మెరిసిపోతున్న ఇంద్రనీల మణి ఒకటి బయటపడింది. ఆ మణిని పొదిగి, అమ్మ వారికి నవరాత్రుల సందర్భంగా ఒక కిరీటాన్ని తయారుచేయించాలని, వైభవ వర్మ తండ్రి వీరసేనుడు నిశ్చయించాడు.

అయితే, ఇంద్రనీలమణి దొరికిన వార్త వేగుల ద్వారా విన్న యువరాజు రుద్రకేతుడు, –చక్రవర్తి అయిన తన తండ్రి త్వరలోనే తనను మహారాజును చేసి విశ్రాంతి తీసుకో బోతున్నాడనీ, తనకు జరిగే పట్టాభిషేక సమయంలో, ఆ మణిని తన కిరీటంలో




దేవీ ఉత్సవాల చివరి రోజున ప్రచండగిరి నుంచి యువరాజు రుద్రకేతుడు వచ్చాడు.

తెల్లవారు జామున వసంతోత్సవాల సంరంభం ఆరంభమయింది. రాజమందిరం ముందు వెండితొట్టెలో పసుపు, కుంకుమ, చందనం కలిపిన వసంతాన్ని వైభవవర్మ బంగారు చెంబుతో ముంచి జయంతి తల మీదపోశాడు. జయంతి చిరుకోపంతో అతడి చేతిలోని చెంబు గుంజుకుని, వసంతాన్ని ముంచి వైభవవర్మ మీద పోయడానికి అతడి వెంటబడింది.

ఇదిచూసిన రుద్రకేతు ఈర్ష్యతో భగ్గు మన్నాడు. ఆలస్యం చేస్తే జయంతి తనకు దక్కదన్న భయం కలిగింది. అతడు చరచరా నడిచి, రాజు చంద్రదత్తుణ్ణి సమీపించి, "మహారాజా! వచ్చే కార్తీక శుద్ధ దశమినాడు, నాకు పట్టాభిషేక మహోత్సవం జరుగుతుంది. అదే సుముహూర్తానికి మీ జయంతిని, నా పట్టమహిషిని చేసుకోవాలని నిశ్చయించు కున్నాను. నేను అల్లుడు కావడం, మీకు అభ్యంతరం కాదనుకుంటాను," అన్నాడు.

ఈ మాటలు విని చంద్రదత్తుడు నివ్వెర పోయాడు. పక్కనే వున్న రాజు వీరసేనుడు ఈ ఆకస్మిక పరిణామానికి విస్తుపోయాడు. చంద్రదత్తుడు వెంటనే ఏ జవాబూ చెప్ప లేక వూరుకున్నాడు. అతడి మౌనానికి కారణం గ్రహించిన రుద్రకేతుడు కోపంగా, "మీ కుమార్తెకు నాతో వివాహం చెయ్యడం ఇష్టం లేకపోతే చెప్పండి. నేను కోరుకున్నది ఎలా దక్కించుకోవాలో, నాకు బాగా తెలుసు!" అన్నాడు.

ధరించాలని వున్నదనీ, కనుక వెంటనే పంపవల సిందిగా, రాజు వీరసేనుడికి ఆదేశం పంపాడు.

ఇది విని కలతచెందిన వీరసేనుడు ఏమి చేయడమా అని ఆలోచిస్తూండగా, వైభవవర్మ కల్పించుకుని, "ఇందులో అంతగా ఆలోచించ వలసిందేమీ లేదు, నాన్నగారూ! మనకు దైవ కార్యం కంటే ప్రజాక్షేమం ముఖ్యం," అన్నాడు.

వీరసేనుడు మౌనంగా తల ఊపాడు. మర్నాడు వైభవవర్మ ప్రచండగిరికి బయలు దేరి వెళ్ళి, మణిని స్వయంగా రుద్రకేతుడికి అందజేశాడు.

వారం తిరక్కుండానే ప్రణయపురిలో దేవీ నవరాత్రులుప్రారంభమైనాయి. ఉత్సవాలకు ఒక రోజు ముందుగానే, శ్రీచందనపురం నుంచి రాజూ, రాణీ, జయంతీ ప్రణయపురం చేరుకున్నారు.

కొద్దిదూరంలోవుండి రుద్రకేతుడు తీవ్ర స్వరంతో మాట్లాడడం విన్న వైభవవర్మ, జయంతీ తండ్రి దగ్గరికి వచ్చారు. జయంతి తండ్రికేసి సంగతేమిటన్నట్టు చూసింది. అయితే, చంద్రదత్తుడు, కుమార్తెకేసి నిస్సహాయంగా చూసి వూరుకున్నాడు.

అప్పుడు, రుద్రకేతుడు కాస్త వెట కారంగా, "సంగతేమిటో, నేను చెబుతాను, జయంతీ! నువ్వు త్వరలో, కానున్న ప్రచండ గిరి చక్రవర్తికి పట్టపురాణి కాబోతున్నావు. ఆ ఆనందంతో ఉక్కిరిబిక్కిరైన మీ నాన్న గారికి, నీకు సంగతి చెప్పడానికి మాటలు పెగలడం లేదు," అన్నాడు.

జయంతి వెంటనే, "మన్నించండి, యువ రాజా! ఈ వివాహం నాకు ఆమోదయోగ్యం కాదు. ఇదివరకే నేను, మరొకరిని వివాహ మాడేందుకు నిశ్చయించుకున్నాను," అన్నది.

"ఓహోఁ, అదా సంగతి! ఈ వైభవవర్మ కేవలం సామంత యువరాజు. రేపే నేను, మా నాన్నగారితో సంప్రదించి, మీ రెండు రాజ్యాలపై యుద్ధం ప్రకటిస్తాను. అప్పుడు, ఈ వైభవవర్మకు ఉరిశిక్షా తప్పదు; నువ్వు నన్ను చేపట్టకా తప్పదు," అన్నాడు రుద్రకేతుడు కోపంతో ఊగిపోతూ. అప్పుడు, వైభవవర్మ కల్పించుకుని, "యువరాజా, ఆవేశపడకండి! జయంతితో, నా వివాహానికి పెద్దల ఆశీర్వాదం కూడా వున్నది. ఇప్పుడు మీరు వ్యక్తిగత కక్షలతో, మా రాజ్యాలమీద యుద్ధం ప్రకటించడం, ఏమాత్రం ధర్మం అనిపించుకోదు," అన్నాడు.

ఇది వింటూనే రుద్రకేతు రౌద్రంగా, "మూర్ఖుడా, భావి ప్రచండగిరి చక్రవర్తితో, మాట్లాడే తీరు ఇదేనా?" అన్నాడు.



ఆ మరుక్షణం, వైభవవర్మ కత్తిపిడి మీద చేయి వేసి, "యువరాజా, ఒక పని చేద్దాం! ఇరువురం కత్తి యుద్ధానికి పూను కుందాం. ఇందులో ప్రాణాలతో బయట పడినవాడు, జయంతిని వివాహమాడతాడు. అప్పుడు, మన మూడు రాజ్యాల మధ్యా యుద్ధ ప్రమాదం తప్పుతుంది. అపారమైన జననష్టం, ధననష్టం వుండదు. కత్తి దూయండి, మరి!" అన్నాడు గంభీరంగా.

వైభవవర్మ ఇలా అనగానే, రుద్రకేతు క్షణకాలం నివ్వెరపోయి, తర్వాత శాంతంగా, "ప్రణయపురి యువరాజా! మనిద్దరి మధ్యా ఎలాంటి కత్తియుద్ధం అవసరం లేదు. నువ్వూ, జయంతీ వివాహమాడి సుఖంగా వుండండి. ఆమె పట్ల నేను అనాగరికంగా ప్రవర్తించాను, అందుకు విచారిస్తున్నాను," అన్నాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, ''రాజా, రాకుమారి జయంతి, తను ఎంతగానో ముచ్చటపడే తెల్లగుర్రాన్ని రుద్రకేతుడి కివ్వవలసిన పరిస్థితికి చాలా బాధపడింది. వైభవవర్మ ఆ గుర్రం సంగతి మరిచిపొమ్మని ఆమెకు చెప్పాడు. అలాగే తనకు లభించిన ఇంద్ర నీలమణిని రుద్రకేతుడు కావాలన్నప్పుడు, అతడి పరం చేశాడు. ఈ సందర్భాలలో వైభవవర్మ, రుద్రకేతుడంటే భయపడు తున్నాడనే కదా అనుకోవాలి? అలాంటి వాడు జయంతి విషయం వచ్చేసరికి, అతడిపై కత్తి దూయడానికి సిద్ధపడ్డాడు. అలాగే, తను కోరిందల్లా సాధించితీరాలనే మొండి పట్టుదలగల రుద్రకేతుడు, వైభవ వర్మ కత్తి దూయమన్నప్పుడు భీరువులా ప్రవర్తించాడు. ఇదంతా చూస్తూంటే, ఈ రాకుమారులు ఏ ఎండకాగొడుగు పట్టే స్వార్థపరులూ, భీరువులూ తప్ప, పట్టుదలా, స్థిరబుద్ధీ వున్నవాళ్ళు కాదన్న సందేహం కలుగుతున్నది. ఈ సందేహాలకు సమా ధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''స్వార్థం, పట్టుదలా, స్థిరబుద్ధీ అనేవాటిని, ఆయా వ్యక్తులపై పరిస్థితుల ప్రభావాన్ని పరిగణన లోకి తీసుకుని, నిర్ణయించవలసివుంటుంది. ఇరువురూ కోరి వివాహమాడదలచిన వాళ్ళు స్వార్థపరులుకారు. ఎంత పట్టుదలవున్నా, కార్యసాధనలో నూటికి నూరువంతులు ఓటమి తప్పదని తెలిసినప్పుడు, తిరోగ మించడం పట్టుదల లేకపోవడం కాదు. అలాగే, ఎంతటి స్థిరబుద్ధీ, ఆత్మాభిమానం వున్నా, ప్రబలుడైన శత్రువు నుంచి పారి పోవడం, భీరుత్వమనిపించుకోదు. ఈ కార ణాలవల్ల ప్రేమించిన యువతి కోసం కత్తి దూయడానికి సిద్ధపడిన వైభవవర్మా, యుద్ధ మంటూ తటస్థిస్తే, జరగబోయే ధన ప్రజా నష్టానికి వెరచిన రుద్రకేతూ, తమ తమ స్వభావాలకూ, రాజనీతిజ్ఞతకూ అనుగుణం గానే ప్రవర్తించారు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]





# గానుగెద్దు-గంగిరెద్దు

సుందరం అనే వాడు, రామాపురంలో ధనికు డైన చలపతి అనే ఒక వ్యాపారి కొడుకు. చిన్నప్పటినుంచీ, పట్నంలో తనమేనమామ దగ్గరవుండి చదువుకున్నాడు. అయితే, తండ్రి బాగా గారాబం చెయ్యడం, అడిగి నప్పుడల్లా డబ్బు పంపడం మూలాన, సుందరం చెడు స్నేహాలవైపు మొగ్గి, చివరకు ఎలాగో చదువు పూర్తి అయ్యిందనిపించి, రామాపురం తిరిగి వచ్చాడు.

సుందరానికి తాను పట్నంలో చదివి వచ్చానని, బాగా అహంకారం. ఆ అహంకారం అతడి ప్రతి మాటలోనూ కనిపించేది. సహ జంగా వాగుడుకాయ అవడంవలన, వాదనలో తన తెలివితేటలు ప్రదర్శిస్తూ, ఎప్పుడూ తనదే పైమాట కావాలని తాపత్రయపడేవాడు.

ఒకరోజు స్నేహితులతో కలిసి, వీధి వెంట వెళుతున్న సుందరానికి వీరయ్య అనేవాడు చేతికి కట్టు కట్టుకుని ఎదురుపడ్డాడు.

"ఏం, వీరయ్యా! చేతికి ఏమిటా కట్టు?" అని అడిగాడు సుందరం.

"కిందపడ్డానండి," అన్నాడు వీరయ్య.

"అయ్యో, ఎలా పడ్డావు?" అని అడిగాడు సుందరం.

"పరిగెత్తుతూంటే పడ్డానండి," అన్నాడు వీరయ్య.

"అలాగా! అసలు ఎందుకు అలా పరిగెత్త వలసివచ్చింది?" అని ప్రశ్నించాడు సుందరం.

"వీధికుక్కొకటి వెంటబడింది, చూడక దాని తోక తొక్కానండి," అన్నాడు వీరయ్య బాధగా.

"ఎందుకు చూడలేదు?" అన్నాడు సుందరం.

" ఏదో పరధ్యానంగా వుండి," అంటూ వీరయ్య వెళ్ళబోయాడు.

దాసరి వెంకటరమణ



"ఒక్క క్షణం అగు, వీరయ్యా! ఎందుకా పరధ్యానం?" అన్నాడు సుందరం.

"ఏం చెప్పమంటారయ్యా! ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాను, చూసుకోలేదు," అన్నాడు వీరయ్య.

"ఏం,ఆలోచిస్తున్నావు?"అని సుందరం రెట్టిస్తూ అడిగాడు.

వీరయ్య దిగులు ముఖం పెట్టి, "ఏవో మా ఇంటి గొడవలు, అంతే,"అన్నాడు.

ఆ తర్వాత, సంభాషణ వేగం పుంజుకున్నది. "సరే! పరిగెత్తుతూంటే కిందఎందుకుపడ్డావు?" అన్నాడు సుందరం.

"కాలికి ఏదో అడ్డుపడింది!"

"ఏం అడ్డుపడింది?"

"ఏమోనయ్యా, నేను చూడలేదు," అన్నాడు వీరయ్య.

"సరే! కిందపడితే, కుడిచేతికే ఎందుకు దెబ్బ తగిలింది? ఎడమచేతికి ఎందుకు తగల్లేదు?"

వీరయ్య, సుందరంవంక ఎగాదిగా చూసి, అక్కణ్ణించి పరిగెత్తబోయాడు. సుందరం, అతణ్ణి పట్టుకుని ఆపి, "చూడూ! మళ్ళీ తప్పు చేస్తున్నావు. కుక్క తోక తొక్కడం తప్పు. అది వెంటబడితే పరిగెత్తడం తప్పు. ఇవిగాక, ఇంకా మరికొన్ని తప్పులు!" అన్నాడు.

"అయ్యా! ఈసారికి నన్నొదిలెయ్యండి. ఇంకెప్పుడూ ఇలాంటి తప్పులు చేయను," అంటూ, వెళ్ళిపోయాడు వీరయ్య.

మరొకసారి, స్నేహితులతో కలిసి, వీధిలో వెళ్తున్న సుందరం దృష్టి, భైరవయ్య నూనె గానుగ మీద పడింది. ఎద్దు ఏమాత్రం పక్కచూపు లేకుండా, అదే పనిగా తిరుగుతున్నది. భైరవయ్య గానుగకు కాస్త దూరంలో చెట్టుకింద, ఎద్దుకు దాణా కలిపిన కుడితిని తయారు చేస్తున్నాడు. సుందరం కాసేపు భైరవయ్యను ఆటపట్టించాలనిపించి, స్నేహితులతో అటువేపు నడిచాడు.

భైరవయ్యకు, సుందరం గురించి పూర్తిగా తెలుసు. అయినా ఓపికగా అతడు అడిగిన ప్రతి ప్రశ్నకు పొడిపొడిగా, సూటిగా తెలివిగా సమాధానాలు చెప్పకుంటూ వచ్చాడు. భైరవయ్య జవాబులు చివరకు సుందరానికే విసుగనిపించసాగింది.

సుందరం కొద్దిసేపు మౌనంగా వూరుకుని, "అవును,భైరవయ్యా! గానుగెద్దుకెందుకు అంత విలువైన ఉలవలూ, తవుడూ పెట్టి కుడితి కలుపుతున్నావు? అదేమంతపని చేస్తుందని?" అని అడిగాడు.

''ఎందుకు పనిచేయదు. ముప్పొద్దులా గానుగను ఆడిస్తూ తిరుగుతూంటుం దిగా!'' అన్నాడు భైరవయ్య.

'' నువ్వు లోపల ఏదో పనిలో వున్నా వనుకో, అప్పుడు తిరుగుతుందని ఏం నమ్మకం? అట్టే నిలబడి పోవచ్చు గదా!'' అన్నాడు సుందరం.

భైరవయ్య, సుందరం కేసి తిరిగి, ''అందుకే ఎద్దుమెడలో ఒక గంట కట్టాను. నేను లోపల ఏ పనిచేసుకుంటున్నా, ఆ గంట చప్పుడును బట్టి, ఎద్దు తిరుగుతున్నదీ లేనిదీ తెలిసి పోతుంది,'' అన్నాడు.

'' అది తిరగకుండా, ఒక చోట నిలబడి ఊరికే తలవూపుతూండవచ్చు కదా! అప్పుడు అది చేస్తున్న మోసం, నీకెలా తెలుస్తుంది? '' అని అడిగాడు సుందరం.

ఆ ప్రశ్నతో భైరవయ్యకు ఒళ్ళు మండి పోయింది. సుందరం కేసి తీవ్రంగా చూస్తూ, ''అది నన్ను మోసగించడానికి పట్నంలో అడ్డమైన చదువులూ చదివి వచ్చిందా ఏమన్నానా?'' అన్నాడు.

భైరవయ్య జవాబుకు సుందరం మిత్రు లందరూ గొల్లున నవ్వారు. సుందరానికి తలకొట్టేసినట్లయింది. అతడి నోట మాట పెగలలేదు.

అప్పుడు భైరవయ్య, ''చూడు, సుందరం! ఇంత తిని, ఏ పనీ చేయకుండా వీధుల వెంట గాలికి తిరిగేవాణ్ణి, ఎందుకలా గాను గెద్దులాగానో, గంగెద్దులాగానో తిరుగుతావని కోప్పడతారు. కానీ అదెంత తప్పో తెలుసా? ఎందుకంటే, గానుగెద్దు కష్టపడి గానుగ తిప్పి నూనె తీస్తుంది. గంగెద్దు ఊరూరూ తిరుగుతూ, తన ఆట చూపిస్తూ అందరినీ ఆనందపరిచి - తనను నమ్ముకున్న యజ మానిని పోషిస్తుంది. అటువంటి ఎద్దులతో, గాలికి తిరిగే సోమరివెధవను పోల్చడం, ఎంతో అన్యాయం కదా!'' అన్నాడు.

సుందరం మారుమాట్లాడకుండా, తల వంచుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆనాటినుంచీ అతడు, తండ్రితోపాటు వ్యాపారం చూసుకుంటూ, కొద్ది కాలంలోనే తన తెలివి తేటలతో వ్యాపారాన్ని అభివృద్ధి చేశాడు.



కథకు సరైన ముగింపు రాయండి! చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

*ఒక చిన్నకథ తొలిభాగం దిగువ ఇవ్వబడింది. ఆసక్తికరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి. ఇక కథను చూద్దాం:*

మలయపుర మహారాజు మార్తాండవర్మ వృద్ధుడైపోవడంతో, యువ రాజు ప్రతాపుడికి రాజ్యపట్టాభిషేకం చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. కాబోయే రాజు ప్రజల కష్ట సుఖాలను ప్రత్యక్షంగా తెలుసుకోవడం అవసరం అన్న ఉద్దేశంతో ప్రతాపుడు, సాధారణ యువకుడి వేషంలో దేశసంచారానికి బయలుదేరాడు.

రాజధానిని వదిలి చాలాదూరం వెళ్ళిన ఆయన గుర్రంపై నుంచి దిగి, కాలినడకనే వెళ్ళసాగాడు. కొంతదూరం నడిచేసరికి ఆయన ఎడమకాలి చెప్పు తెగింది. వాటిని అక్కడే వదిలేసి చెప్పులు లేకుండానే నడవ సాగాడు. మరికొంతదూరం వెళ్ళేసరికి ఆయన కాలికి ముల్లు గుచ్చుకున్నది. ముల్లును వెలికి తీయడానికి ప్రయత్నించాడు కాని, సాధ్యపడలేదు. నడవలేక బాటపక్కన వున్న బండరాతిపై కూర్చుని అటుమైపు ఎవరైనావస్తే సాయం అడగవచ్చని ఎదురుచూడసాగాడు.

కొంతసేపటికి ఒక పల్లెటూరి యువతి, పొలంలో పని చేస్తూన్న తన తండ్రికి అన్నం తీసుకుని అటుమైపు వచ్చింది. తను పడుతూన్న బాధ బయటకు కనిపించకూడదని నిస్సహాయంగా ప్రయత్నిస్తూన్న ఆ యువకుణ్ణి చూసింది. కారణం అడిగింది. అతడు చెప్పాడు. ఆ యువతి తలపై వున్న అన్నం బుట్టను పక్కనపెట్టి, ఒక పెద్దముల్లు తీసుకుని యువకుడి పాదంలోకి గుచ్చి, లోపలవున్న ముల్లును క్షణంలో తీసేసింది. గాయం నుంచి నెత్తురు కారడంతో, ఎదుట వున్న ఏదో మొక్కనుంచి కొన్ని ఆకులు కోసి అరచేత్తో బాగా నలిపి, గాయం మీద పిండింది. ఆ తరవాత పైట చెంగు నుంచి ఒక ముక్క చింపి కాలికి కట్టుకట్టింది.

బాధనుంచి ఉపశమనం పొందిన యువరాజు, "చాలా కృతజ్ఞుణ్ణి సోదరీ! నువ్వు చేసిన ఉపకారానికి ఏం సహాయం కావాలో చెప్పు, చేస్తాను," అన్నాడు.

"మొదట నీకు నువ్వు సాయం చేసుకోవడం నేర్చుకో. ఆ తరవాత నాకు సాయంచేసే విషయం చూద్దువుగాని. అది సరేగాని, కాల్లో చిన్న ముల్లు గుచ్చుకున్నందుకే అలా బెంబేలు పడిపోయావేమిటి?" అన్నది ఆ యువతి కాస్త ఎగతాళిగా నవ్వుతూ.

యువరాజుకు ఆమె అందగత్తెగా, తెలివిమంతురాలిగా కనిపించింది. అతడు చిన్నగా నవ్వుతూ, "ఇంతకు పూర్వం నేనెప్పుడూ చెప్పులు లేకుండా నడవలేదు. నా కాలికి ముల్లు గుచ్చుకోవడం ఇదే మొదటిసారి. అందుకే దానిని ఎలా వెలుపలికి తీయాలో తోచలేదు. సమయానికి నువ్వు వచ్చి సాయం చేయలేదంటే ఏం చేసేవాణ్ణో నాకు తెలియదు. సరే, అది అలా వుంచు. ఇప్పుడు నేను నీకు ఏం సాయం చేయాలో చెప్పు!" అని అడిగాడు.

"ఈ రాజ్యానికేదో రాజైనట్టు మాట్లాడుతున్నావు?" అంటూ ఆ యువతి మళ్ళీ అందంగా నవ్వి, "నువ్వు నన్ను హాయిగా రాణిని చేసేసుకో," అన్నది!

యువరాజు తానెవరైనదీ చెప్పాడా? లేదా? ఆ యువతి చెప్పినట్టు తనకుతాను సాయం చేసుకోవడానికి అవకాశం రాగానే జారుకున్నాడా? మరేదైనా ఉపాయం ఆలోచించాడా? లేక ఆ యువతిని తన రాణిని చేసుకున్నాడా? ఈ కథకు చక్కని ముగింపు రాసి, పేరు పెట్టండి. మీ ఎంట్రీలమీద సృజనాత్మక పోటీలకు అని రాసి సెప్టెంబర్ 30వ తేదీలోగా మాకు చేరేలా పంపండి.

## ఆగస్ట్ 2000 భారతదర్శనం క్విజ్ సమాధానాలు

1. ఎ. ఆర్యభట్ట.
   బి. కాశ్మీర్‌లోని అమర్‌నాథ్‌లో.
   సి. నచికేతుడు.
   డి. చార్వాకుడు, జాబాలి (సత్యకామజాబాలి కాదు) గోషాలుడు.
   ఇ. అక్బర్ (దిన్-ఇ-ఇలాహి).
2. రురుడు; ప్రమద్వర.






[కౌండిన్యదేశపు యువరాజు విజయదత్తుడు, పట్టాభిషేకానికి సంసిద్ధుడై, స్వర్ణసింహాసనం తొలి రెండు మెట్లమీద సాలభంజికల రూపంలో వున్న సత్యశక్తి, ధర్మశక్తి అడిగిన ధర్మసందేహాలకు యుక్తియుక్తంగా సమాధానాలు చెప్పి మెప్పించాడు. మూడవ మెట్టుమీది న్యాయసాలభంజిక విజయదత్తుడి న్యాయ నిర్ణయశక్తిని పరీక్షించడానికి – న్యాయవర్ధన మహారాజును గురించీ ఆయన సమక్షానికి విచారణకు వచ్చిన మూడు తగవులను గురించీ వివరించసాగింది. తరవాత —]

మణికర్ణుడి మాటలకు ఎక్కడా అడ్డుతగల కుండా, అంతా శ్రద్ధగా విన్న న్యాయవర్ధన మహారాజు, అతడు ముగించగానే, రత్న గుప్తుడివైపు తలతిప్పాడు.

వెంటనే రత్నగుప్తుడు లేచి, రాజుకు మళ్ళీ నమస్కరించి, "మహారాజా, తమకు నేను కొత్తవాణ్ణి కాను. గత ముప్పై సంవత్స రాలుగా నేను ఎంత నిజాయితీగా వ్యాపారం చేస్తూ బతుకుతున్నానో, వర్తకులందరితో బాటు తమకూ తెలుసు! వ్యాపారంలో నేను ఎంత ఆర్జించానో కూడా తమకు తెలియంది కాదు. అటువంటిది, నేను డబ్బు కోసం ఒక విదేశీ కుర్రవాణ్ణి ఎందుకు మోసం చేస్తాను ప్రభూ? నేనతడికి నలభైవేల రూకలూ ఎంచి ఇచ్చి మరీ సరుకు స్వాధీనం చేసుకున్నాను. ఇంతకంటే ఏమి చెప్పటానికీ, నాకు నోరు రావటం లేదు. ఇంత కాలానికి, ఈ విదేశీ కుర్రవాడిమోసకారితనం వల్ల, నిండు

లక్ష్మి గాయత్రి



సభలో ఇలా దోషిగా నిలబడవలసిరావటమే, నాకు ప్రాణాంతకంగా వున్నది,"అంటూ గద్గద స్వరంతో చెప్పి, తలవంచుకున్నాడు.

రత్నగుప్తుడి మాటలకు న్యాయవర్ధనుడు చిన్నగా నవ్వి, "రత్నగుప్తా, భగవంతుడైన శ్రీకృష్ణుడే వెన్నదొంగగా ముద్రపడ్డాడు. సాధారణ మానవులమైన మనం, విధిలీల లకు తలవంచక తప్పదు. ఇంతకూ, నీ వ్యాపారానికీ, వంశానికీ ఒక్కగా నొక్క వారసుడైన, నీ ముద్దుబిడ్డ హేమగుప్తుడు కుశలమే గదా?" అంటూ ఆప్యాయంగా పరామర్శించాడు.

ఆ కుశలప్రశ్న వినగానే రత్నగుప్తుడి మొహం కాస్త కళ తప్పి, తల మరికాస్త కిందికి వంగింది. "కుశలమే, ప్రభూ!" అంటూ రత్న గుప్తుడు నెమ్మదిగా జవాబిచ్చాడు.

మహారాజు తల పంకించి, "రత్నగుప్తా, నువ్వు సభాసదులమధ్య దోషిగా చింతపడ నవసరం లేదు. అలా ఏకాంతంగా కూర్చుని నిర్మల హృదయంతో దైవధ్యానం చెయ్యి. భగవంతుడు సర్వాంతర్యామి. ఆ దివ్య దృష్టిని, ఏ అన్యాయమూ దాటి పోలేదు," అని, భటులవైపు చూసి, రత్నగుప్తుణ్ణి లోప లికి తీసుకువెళ్ళమని సైగచేసి, మణి కర్ణుడితో, "మణికర్ణా! రత్నగుప్తుడు పెద్ద మనిషి! అతనికి తన కుమారుడెంతో నువ్వూ అంతే. అనవసరంగా వ్యథ చెందక, కాసేపు అలా కూర్చో!" అన్నాడు.

ఆ మాటలు విని, రత్నగుప్తుడు దిగాలు పడిపోతూ భటుల వెనక బయలుదేరాడు. రాజు ఎవరిని దోషిగా నిర్ణయిస్తున్నాడో అర్థం గాక తికమక పడుతూ, భటులు చూపించిన చోట చతికిలబడ్డాడు, మణికర్ణుడు.

రాజు మూడవ తగువుదార్లకు అనుమతి ఇచ్చాడు. ఈ మూడవ తగువు చాలా స్వల్ప మైనది. ఒక ముసలితల్లికీ, ఆమెకున్న ఒక్కగానొక్క కొడుక్కూ మధ్య వచ్చిన తగువది. ఒక పల్లెలో నివసిస్తున్న ఆ తల్లీ కొడుకూ ఇద్దరూ సభకు వచ్చారు.

అభియోగదారుడైన కొడుకు ముందు ప్రారంభించాడు: "మహాప్రభో! నా పెళ్ళానికి పనిపాటలు అంత బాగా చేతగాని మాట నిజమే, స్వామీ! కాని, శుద్ధ అమాయకు రాలు. ఏ పని ఎలా చెయ్యాలో కాస్త నెమ్మ దిగా చెబితే, ప్రాణంపెడుతూ ఇంటెడు పనీ చక్కగా చేస్తుంది; విసుక్కోదు, చిరాకు పడదు! కల్లాకపటం తెలియని మనిషి, స్వామీ, అది! కాని ఇదిగో ఈ ముసలిది వుందే,

ఇది దాన్ని పట్టుకుని రోజల్లా తిడుతూనే వుంటుంది. 'ఒసే చవటదద్దమ్మా,' 'ఒసే, మంకు పట్టుదానా' అంటూ, రంకెలు పెడుతుందే గాని, ముచ్చటకు ఒక్కసారైనా సరే, పేరుపెట్టి, 'వెంకమ్మా' అని పిలవదు. తిడుతున్నది చాలక, రెండు రోజుల కొకసారైనా చావగొడుతుంది. పాపం, మొర్రో మని ఏడవటం తప్పించి ఇంకేమీ చెయ్య లేని వెర్రిబాగుల్ది, నాపెళ్ళాం! అలాంటి దాన్ని పట్టుకు కొడితే, నరకానికి పోతావే, కొట్టకే అంటే, ఈ ముసల్ది వినదు.

"చూసి చూసి ఇక లాభం లేదని, నా పెళ్ళాన్ని తీసుకుని వేరే పోదామను కున్నాను. కాని, మేం గనకగుమ్మం దాటామా, ఇంకా పదడుగులైనా వెయ్యకముందే, బావిలో దూకి చస్తానని, ముసల్ది బావి గట్టు ఎక్కి కూర్చుంటున్నది. పోనీ చూద్దామని, మా గ్రామాధికారిగారికి, నా గోడంతా చెప్పు కున్నాను. ఆయన మాట ముసల్ది పిసరంత కూడా లెక్క చెయ్యటం లేదు. ఆయనకు కోపం వచ్చి కేక వెయ్యబోతే, వెంటనే బావి దగ్గరకు పరిగెత్తింది. ఇక విధిలేక ఆయనే బండి కట్టించి, ముసల్దానికి ఏవో మాయ మాటలు చెప్పి ఇక్కడికి పంపారు. మహాప్రభో, దీని ఆగడాల వల్ల నాకు నానాటికి, కన్నతల్లి అన్న తీపికూడా లేకుండా పోతున్నది. ఇక దీనికి మీరే తగు బుద్ధి చెప్పాలి, మహారాజా!" అంటూ, తన గోడు వెళ్ళబోసుకున్నాడు.

కొడుకు మాట పూర్తి అయీ కాకముందే, అతడి ముసలి తల్లి నోరు నొక్కుకుంటూ పెద్ద గొంతుతో, "హవ్వ..హవ్వ! అత్తగారు కోడల్ని రెండు దెబ్బలువేస్తే, వీధిన పడి ఇంత రాద్ధాంతం చెయ్యటం ఏనాడైనా ఎరుగుదుమా! వీళ్ళిద్దరూ కుక్కిన పేనుల్లా





నా ఇంట వున్నారా సరేసరి, లేకపోతే నేను బావిలో దూకిచావటం ముమ్మాటికీ ఖాయం!'' అంటూ కరాఖండిగా చెప్పేసింది.

వెంటనే రాజు, అక్కడే వున్న ఇద్దరు భటుల్ని పిలిచి, ''ఒరే, ఈ ముసలిదాన్ని కాళ్ళూ చేతులూ కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కి, శ్మశానానికి ముందర వున్న పెద్దదిగుడుబావిలో పడెయ్యండి!'' అంటూ ఆజ్ఞాపించాడు.

రాజు ఆజ్ఞ విని తల్లీ కొడుకూ, ఇద్దరూ తెల్లబోయారు. ముందుగా తేరుకున్న తల్లి, తనను పట్టుకోవటానికి వస్తున్న భటులకు దొరక్కుండా, అటూ ఇటూ పరిగెత్తుతూ, ''ఓరి నాయనో ఇదెక్కడి చావురా! దేవుడో, మాయదారి రాజు, నన్ను బావిలో తోసెయ్య మంటున్నాడేమి(ట్రో, బాబో!'' అంటూ కేకలు పెట్టసాగింది.

భటులు, ముసలిదాని వెనక పరిగెత్తి, సులభంగానే దాన్ని అందుకుని, పెడ రెక్కలు విరిచి పట్టుకున్నారు. అప్పుడు రాజు, ముసలిదాన్ని దగ్గరకు తీసుకు రమ్మని, కఠినంగా, ''పొగరుబోతుదానా! బావిలో దూకుతానో, బావిలో దూకుతానో, అని గోలపెడుతున్న దాన్ని, బావిలోపడెయ్య మనటం, నా తప్పా? నన్ను మాయదారి రాజు అన్నందుగ్గాను, నిన్ను బావిలో కాదు మొసళ్ళ చెరువులో తోయిస్తాను, చూడు!'' అని భటులతో, ''ఒరే, దీన్ని తీసుకుపోయి మొసళ్ళ చెరువులోకివిసిరెయ్యండి,'' అన్నాడు.

వెంటనే ముసలిది నెత్తీ నోరూ కొట్టు కుంటూ, ''పొరబాటయిపోయింది, బాబో, నన్ను చంపకండి మారాజా. నేను బావిలో దూకా దూకను, నా కోడల్ని కొట్టా కొట్టను, బుద్ధిగా వుంటాను! నన్ను నమ్మండి, స్వామీ!'' అంటూ గోలపెట్టింది.

రాజు, తల అడ్డంగా ఊపి, ''నీలాంటి వదరుబోతుల్ని, అంతసులభంగా నమ్మేందుకు లేదు!'' అని, భటులతో, ''ఒరే, ప్రస్తు తానికి దీన్ని కారాగారంలో పడెయ్యండి. రోజుకు ఒక పూటే తిండి పెట్టి, రోజూ నాలుగు కొరడా దెబ్బలు కొట్టమని, అక్కడి అధికారికి చెప్పండి! మళ్ళీ బావిమాట ఎత్తిందో, మొసళ్ళ చెరువులోకివిసిరెయ్యండి,'' అన్నాడు.

భటులు తలలాడించి, కాళ్ళూ చేతులూ కొట్టుకుంటున్న ముసలిదాన్ని, బలవంతంగా అక్కడి నుంచి లాక్కుపోసాగారు. ఇది చూస్తూనే ముసలమ్మ కొడుకు కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ, ''మహారాజా, మా అమ్మను

నిజంగా మొసళ్ళ చెరువులోకి తోయిస్తారా?'' అంటూ ప్రశ్నించాడు.

ఆ మాటకు రాజు చిరునవ్వు నవ్వి,'' ఆ సంగతి భటులకు కూడా తెలుసు లేవయ్యా! చస్తాచస్తా, అంటూ మనల్ని బెదిరించే, మీ అమ్మలాంటివాళ్ళకు అది ఒక బెదిరింపు, అంతే. కారాగారంలో రెండు రోజుల పాటు, ఒంటరిగా పడివుంటే, మీ అమ్మబుద్ధి చక్కగా కుదుటపడుతుంది. ఈ రెండు రోజులూ ధర్మసత్రంలో గడిపి, ఎల్లుండి సాయంత్రం వచ్చి, మీ అమ్మను వెంట బెట్టుకు వెళ్ళు. నోటి దురుసుకొద్దీ ముసలిది అప్పుడప్పుడు ఏమైనా తిట్టినా లక్ష్యపెట్ట వద్దని, నీ భార్యను గట్టిగా హెచ్చరించు. ఇక వెళ్ళిరా!'' అన్నాడు.

ముసలమ్మ కొడుకు, రాజు మాటలకు మహదానందపడి పదేపదే రాజుకు నమస్కరిస్తూ వెళ్ళిపోయాడు.

తర్వాత, మహారాజు, చంద్రన్ననూ, వీరనందుణ్ణీ పిలిపించి, వీరనందుడితో మృదువుగా, ''వీరనందా, ఈ సరికి నీ ఆవేశం కాస్త తగ్గివుంటుంది. ఇప్పుడు బాగా ఆలోచించుకుని చెప్పు, చంద్రన్న కుటుంబం పొదుపుగా బతుకుతున్న తీరును మెచ్చుకుంటూ, నీ కుటుంబం తాలూకు బద్ధకాన్నీ, బాధ్యతంటూ లేని బతుకు తీరునూ, మనసులోనైనా సరే, కనీసం ఒక్కసారైనా తిట్టుకున్నావా లేదా?'' అని ప్రశ్నించాడు.

మహారాజు మాటల్లోని మృదుత్వం వెనక దాగిన పదును గమనించిన వీరనందుడు, ''ఒక్కసారి కాదు, ప్రభూ, చాలాసార్లే తిట్టుకున్నాను. నా భార్యాపిల్లల్ని కూడా తిట్టాను.



అయినా సరే...'' అంటూ తడబడుతూ ఆగిపోయాడు.

''అయినా సరే, ఫలితం లేకపోవడం వల్ల, నువ్వే వాళ్ళదారికొచ్చి రాజీపడ్డావన్న మాట!అంతేనా?''అంటూ చిరునవ్వు నవ్వి, ''అయితే, చంద్రన్న ఆడినమాట తప్పటానికి గల కారణం కూడా డబ్బు కాదని, నువ్వు ఒప్పుకుంటావు గదా?'' అంటూ ప్రశ్నించాడు రాజు.

ఆ ప్రశ్నకు వీరనందుడు అయిష్టంగానే ఒప్పుకుంటానన్నట్టు తలాడించాడు. అతడి ముఖంలో కొట్టవచ్చినట్టు కనిపిస్తున్న, ఆ అయిష్టతను గమనించిన రాజు, ఈసారి కాస్త కఠినంగా, ''వీరనందా! మీరు బద్ధకాలు వదిలించుకుని ఒళ్ళువంచి పనిచేసి బాగు పడలేదు! అందుచేత, చంద్రన్న ఆస్తి మీది ఆశ కొద్దీ గొడవ చేస్తున్నారు. తప్పంతా



చంద్రన్న నెత్తినే రుద్దాలని ప్రయత్నిస్తున్నావు, అవునా?'' అన్నాడు.

వీరనందుడు వెంటనే కళ్ళనీళ్ళ పర్యంతం అవుతూ, ''అవును స్వామీ, అవును! దీని కంతటికీ కారణం ఆ సోమరిపోతుది, నా పెళ్ళామే!'' అన్నాడు.

మహారాజు కాస్త మందలింపుగా, ''వీర నందా! పూర్తి తప్పంతా నీ పెళ్ళానిదేనన్నట్టు మాట్లాడకు. నీలో ఇసుమంత కూడా బద్ధకం లేనట్టయితే, నువ్వు దానికి లొంగకుండా, దాన్నే లొంగదీసుకోగలిగి వుండేవాడివి. సరే, జరిగిందేదో జరిగిపోయింది! నీకు ఆరు రోజులు గడువిస్తున్నాను. నేటికి సరిగ్గా ఆరవ నాటికల్లా నువ్వు నీ పిల్లలందరినీ, నా ఎదుట హాజరు పరచాలి. ఇక్కడి అధ్యాపకులూ, వృత్తి విద్యల్ని నేర్పించే నిపుణులూ, వాళ్ళను పరీక్షించి తగువిధంగా తీర్చిదిద్దుతారు. ఆ బరువు బాధ్యతలన్నీ మావే! అయితే, అందుకుగాను నువ్వు నీ ప్రతి పంటలోనూ సగభాగం గ్రామాధికారికి అప్పచెప్పవలసి వుంటుంది. భూమే లేని నాకు పంట ఎక్కడిదని అనుకుంటున్నావు గదా - నీకు ఒక ఎకరం భూమి కౌలుకివ్వవలసిందిగా, మీ గ్రామాధికారికి పత్రం ఇస్తాను. ఆ ఎకరం నేలను నువ్వూ, నీ భార్యా కలిసి వ్యవసాయం చేయండి. పంటలో సగం నీది. సగం ప్రభుత్వానిది,'' అన్నాడు.

తర్వాత, రాజు, చంద్రన్నకేసి చూస్తూ, ''చంద్రన్నా! నీ కూతురుపెళ్ళి నీ ఇష్టం. అయితే, ఒక్క మాట! ఎంత చెడ్డా వీర నందుడు, నీ స్నేహితుడు. అతడి జీవితం సవ్యంగా లేనప్పుడు, దాన్ని బాగుపరచ టానికి సహాయపడటం, స్నేహితుడిగా, సాటి మానవుడిగా, నీ బాధ్యత. ఆ బాధ్యతను ఇప్పుడు నువ్వు త్రికరణశుద్ధిగా నిర్వహిస్తివా, ఇటు వీరనందుడి జీవితం చక్కబడుతుంది, అటు మీ సంబంధబాంధవ్యాలు మరింత మెరుగవుతాయి. సరే, ఆడిన మాట తప్పటం అనేది ఏ కారణాన జరిగినా, దోషం దోషమే! తప్పుతప్పే! వీరనందుడి కుటుంబం కోసం శ్రమించటం అనేది నువ్వు చేసిన తప్పుకు, నేను విధిస్తున్న శిక్షగా భావించి, ఏమరు పాటు లేకుండా ప్రవర్తించు!'' అన్నాడు.

మహారాజు మాటలకు చంద్రన్న ఆనం దంగా చేతులెత్తి నమస్కరిస్తూ, ''తప్పకుండా అలాగే చేస్తాం, ప్రభూ! అసలు వీరనందుడి కుటుంబాన్ని చిన్నచూపు చూడటమే గాని, వాళ్ళను బాగుచేయాలన్న ఆలోచన రాక

పోవటం మాదే తప్పు! ఇక నుంచి వాళ్ళను మాలో ఒకళ్ళుగా చూసుకుంటూ బాగు పరుస్తాం,'' అన్నాడు.

ఒక మొండి జబ్బుకు, వైద్యుడి దగ్గర కఠినవైద్యం చేయించుకుంటున్న రోగి, తనజబ్బు తగ్గుతుందన్న ఆనందాన్నీ కఠిన వైద్యం పట్ల బాధతో కూడిన అయిష్టాన్నీ ఏకకాలంలో అనుభవిస్తాడు! వీరనందుడు కూడా అదేవిధమైన విరుద్ధభావాల్ని ఒకేసారి ముఖంలో వ్యక్తం చేస్తూ, రాజుకు చేతులెత్తి నమస్కరించాడు.

తర్వాత, రాజు దగ్గర శెలవు తీసుకుని, ఆ ఇద్దరూ వెళ్ళిపోయారు.

అప్పుడు, మహారాజు ఏకాంతంగా ఆలోచిస్తూ కూర్చునివున్న రత్నగుప్తుణ్ణి పిలవనంపాడు.

భటుడి వెంట వచ్చిన రత్నగుప్తుడి ముఖం రక్తవిహీనంగా పాలిపోయి వుండటాన్ని న్యాయవర్ధనమహారాజు సమీపంలో కూర్చుని వున్న, భౌమదేశపు యువరాజు కుమారకేతు గమనించాడు.

మహారాజు కూడా అదే విషయం ప్రస్తావించి, ''శ్రేష్ఠి మహాశయా! మిమ్మల్ని, మీ కుమారుడి గురించిన ఆలోచనలు తీవ్రంగా కలవరపరుస్తున్నట్టున్నది! అంతగా విచార పడకండి. దూరప్రాంతం నుంచి వ్యాపార నిమిత్తం వచ్చిన ఈ మణికర్ణుడి తండ్రి కూడా, ఒకప్పుడు మీలాగే కుమారుడి భవిష్యత్తు గురించి తపించి పోయినవాడే గదా!'' అని, మణికర్ణుడివైపు తలతిప్పి, ''నాయనా, పితృ సమానుడైన ఈ వర్తక శ్రేష్ఠుణ్ణి, జాగ్రత్తగా వెంటబెట్టుకుని, ఈ రోజుకు తిరిగివెళ్ళు. రేపు ఉదయానే నువ్వొక్కడివీ వచ్చి కనిపించు, చాలు!'' అన్నాడు.

ఏ విచారణా, తీర్పూ లేకుండా మహారాజు అలా మాట్లాడటం, మణికర్ణుడికి కొంత ఆశాభంగం కలిగించింది. అయినప్పటికీ రాజు మర్నాడు మళ్ళీ రమ్మని చెప్పాడు గనక, కాస్త ఊరటచెంది, రాజుకు నమస్కరించి బయలుదేరాడు.

రత్నగుప్తుడు కూడా రాజుకు తలవంచి నమస్కరించి, వణుకుతున్న స్వరంతో, ''మహాప్రభూ! మీ ఔదార్యానికి సర్వదా కృతజ్ఞుణ్ణయి వుంటాను, శెలవు !'' అని, మణికర్ణుణ్ణి అనుసరించాడు.

– (ముగింపు వచ్చే సంచికలో)



# జూన్ నెల సృజనాత్మక పోటీ!

*గంగాపురం రాజోద్యానం తోటమాలి పొరుగూరు వెళుతూ మొక్కలకు నీళ్ళుపోసే బాధ్యతను తనతో స్నేహంగా వున్న ఆ తోటలోని కోతులకు అప్పగించాడు. మరునాడు కోతులన్నీ కలిసి చెట్లకు నీళ్ళు పోయడం ప్రారంభించాయి. అయితే, కోతుల పెద్దకు మొక్కలకు చాలినంత నీళ్ళు అందాయా? లేదా? అన్న అనుమానం కలిగింది. కోతులు ఆ సమస్యను ఎలా పరిష్కరించాయి?*

బహుమతి పొందిన రచన

## స్నేహంవల్ల లాభం!

కోతులపెద్ద అలా ఆలోచిస్తూండగా మిగిలిన కోతులన్నీ నీళ్ళుపోయడం పూర్తిచేసి, కొమ్మలపైకి వెళ్ళి ఎగురుతూ ఆడుకోసాగాయి. కోతులపెద్ద వాటన్నిటినీ దగ్గరికి పిలిచి, తన సందేహాన్ని బయటపెట్టింది. ''అవును, నిజమే,'' అంటూ కోతులన్నీ తమ అనుమానం ఎలా తీర్చుకోవాలా అని తికమకపడసాగాయి.

అప్పుడు ఒక ముసలికోతి ముందుకువచ్చి, ''మన అనుమానం తీరాలంటే ఒకటే మార్గం. నీళ్ళుపోసిన మొక్కల్ని పీకి చూడాలి. అయితే, పీకేసిన మొక్కలు చచ్చిపోతాయి కదా? తోటమాలి వీటిని ఎంతో ప్రేమగా పెంచుతున్నాడు. అందువల్ల మొక్కల్ని పీకేయకూడదు,'' అన్నది.

ఆ మాటలతో కోతులపెద్దకు ఒక ఉపాయం తట్టింది. ''మిత్రులారా! ఈ వనంలో మంచి పూలమొక్కలతో పాటు కొన్ని కలుపుమొక్కలు కూడా ఉన్నాయి. మనం వాటిని పీకి చూద్దాం. మన అనుమానం తీరిపోతుంది. తోటమాలి పెంచిన మొక్కలకు హాని జరగదు. ఇంకా బావుంటాయి!'' అన్నది కోతులపెద్ద.

ఆ మాట వినగానే కోతులన్నీ ఒక్కసారిగా ముందుకు దూకి కలుపుమొక్కలన్నిటినీ పీకి చూశాయి. వాటి వేళ్ళన్నీ తడిసి ఉండడంతో పూలమొక్కల వేళ్ళు కూడా తడిసివుంటాయని తృప్తి చెంది మళ్ళీ చెట్లపైకి వెళ్ళిపోయాయి!

పొరుగూరు వెళ్ళిన తోటమాలి మూడు రోజుల తరవాత తిరిగివచ్చి, కళకళలాడుతూన్న పూలమొక్కలను చూసి సంతోషించాడు. కలుపుమొక్కలన్నీ ఏరేసి తోటంతా శుభ్రంగా ఉండడంతో, మరింత ఆశ్చర్యంతో తోటంతా తిరిగి చూశాడు.

ఆనాటినుంచి తోటమాలి కోతులతో మరింత స్నేహంగా ఉండసాగాడు!

– కె. సాహితి, కడప.



# ఓహో... ఒలింపిక్స్!

సమర్పణ : చందమామ





గ్రీసు దేశంలోని ఒలింపియా గ్రీకుదేవతలకు నివాసస్థలం! క్రీపూ. 1370వ సంవత్సరం నుంచే గ్రీసుదేశంలో క్రీడోత్సవాలు ప్రజాజీవనంలో భాగంగా ఉండేవి.

దేవతల యుద్ధంతో ఒలింపిక్ క్రీడలు ప్రారంభమయ్యాయని కవులు చెబుతారు. దేవతల తండ్రి అయిన జీయస్‌కూ, మరొక గ్రీకు దేవుడైన క్రోనోస్‌కూ మధ్య - భూమిపై అధిపత్యం కోసం ఒలింపస్ పర్వతం మీద యుద్ధం జరిగింది. జీయస్ విజయం సాధించి ఆ ఆనందంతో క్రీడోత్సవాలు జరుపుకొన్నాడు.








గ్రీకు సంతానదేవుడు పెలొప్స్, దాదాపు చావు వరకు వెళ్ళిన చారియట్ రేసులో మోసంతో గెలుపొంది, అందాలరాశి హిప్పొడామియా హృదయాన్ని దోచుకున్నాడు. బ్రహ్మాండమైన చారియట్ రేస్ జరిపి, తన సంతోషం వ్యక్తం చేసుకున్నాడు. ఆ విధంగా ఒలింపిక్స్ ఆరంభమయ్యాయని మరొక ఉదంతం చెబుతుంది.



దేవతల తల్లి రియాను ప్రార్థించడానికి, ఆమె కోసం నిర్మించిన దివ్య ఆలయం వద్ద క్రీ.పూ. 1370 వ సంవత్సర ప్రాంతంలో ఈ క్రీడలు ఆరంభమయ్యాయని మరికొందరు చెబుతారు.




సుప్రసిద్ధ గ్రీకువీరుడు హెర్క్యులెస్‌ను కూడా ఒలింపిక్ క్రీడలపితగా పేర్కొంటారు. తన అశ్వశాలను శుభ్రం చేయించడానికి రాజు అజీయస్, హెర్క్యులస్‌ను నియోగించాడు. కష్టమైన ఆ పని పూర్తయ్యాక, రాజు ఆయనకు తగిన పారితోషికం ఇవ్వలేదు. ఆగ్రహం చెందిన హెర్క్యులస్ అజీయస్‌ను చంపి, క్రీడోత్సవాలను ఏర్పాటు చేశాడు.



తెల్లవారకముందే ఆమె భక్తులు ఆలయంలో జ్యోతిని వెలిగించడానికి పోటీపడి పరిగెత్తారు. ఉదయసూర్యుడి తొలికిరణాలనుంచి నిప్పును వెలిగించుకోవాలి!











ఆ రోజుల్లో జీయస్ గౌరవార్థం, త్యాగాగ్నిని రగిలించి క్రీడోత్సవాలను ప్రారంభించే వాళ్ళు. ఉదయ సూర్యుడి తొలి కిరణాలనుంచి వెలిగించుకున్న కాగడాతో నిప్పును రగిలించే వాళ్ళు. తొలి రోజున మబ్బులు పట్టి సూర్యోదయం కనిపించకపోతే, ఆరంభోత్సవం ఆగిపోవలసిందే!






క్రీ.పూ. 670 ప్రాంతంలో ఎలిస్ రాజు ఎఫిటస్ - I క్రీడోత్సవాలకు ఆయుధాలు తీసుకురావడం నిషేధిస్తూ ఆజ్ఞను జారీ చేశాడని చెబుతారు. బద్ధ శత్రువులు సైతం విరోధం పాటించకుండా క్రీడలలో పోటీపడడానికి ఇది దోహదం చేసింది.











దేవతలకూ, పురాతన వీరులకూ పసిపిల్లవాణ్ణి బలిఇచ్చి తినే సంప్రదాయం, అప్పుడెప్పుడో క్రీడోత్సవాలలో ప్రవేశపెట్టబడింది.

ఇఫిటస్‌రాజు ఆజ్ఞ వాగ్దానరూపంలో డెల్ఫీలోని ఒక కంచు పళ్ళెం మీద ఉంగరాల వరుసలా చెక్కబడింది. అది ఈనాటికీ ఉన్నది. దేవతలనుంచి పొందిన సహాయానికి కృతజ్ఞతగా ఈ వాగ్దానం చేయబడింది.









ఒలింపిక్స్ ప్రారంభం కావడానికి పది నెలలకు ముందు నుంచే ఎలిస్‌లోని క్రీడామైదానంలో పోటీదారులు తప్పనిసరిగా శిక్షణ పొందితీరాలి.






ప్రాచీనకాలంలో ఒలింపిక్ క్రీడలు ఐదు రోజుల పాటు జరిగేవి. క్రీడలు ప్రారంభించే తొలిరోజున పోటీలలో పాల్గొనేవాళ్ళూ, న్యాయనిర్ణేతలూ అడవి పంది మాంసం ముక్కను చేతపట్టుకొని - సర్వ వేళలా న్యాయంగా ప్రవర్తించగలమని ప్రమాణం చేసేవారు.









మల్లయుద్ధం, కుస్తీ పోటీలు ఎక్కువగా జరిగేవి. గుర్రపు పందాలు కూడా ...












ఆరాచియాన్ అనే మల్లయోధుడు 'పాంక్రేషన్‌లో' మూడుసార్లు విజేతగా ఒలింపిక్ కిరీటం సాధించాడు. అయితే మూడవసారి కిరీటం పెట్టేలోగా అతడు మరణించాడు. తీవ్రమైన పోటీలో ప్రత్యర్థి అతని గొంతునులిమి పడగొట్టాడు. ఆరాచియాన్ అక్కడే మరణించాడు. అయినప్పటికీ న్యాయనిర్ణేతలు అతని శవానికి కిరీటం పెట్టారు.






బహుశా ఒలింపిక్ క్రీడలలోనే చాలా ప్రతిష్ఠాత్మకమైనది చారియట్ రేస్. అందులో విజయం సాధించడానికి పోటీ దారులు ఏం చేయడానికైనా వెనుకాడేవారుకారు. ప్రత్యర్థులకు లంచాలు ఎరచూపడం; అడ్డుపడి దెబ్బతీయడం లాంటివి చేసేవాళ్ళు. బహుమతులను మాత్రం ప్రాణాలకు తెగించి చారియట్లను నడిపి విజయం సాధించే సారథులకు కాకుండా, ధనికులైన చారియట్ల యజమానులకే ఇచ్చేవారు!



క్రీ.పూ. 415 వ సంవత్సరంలో అల్సిబయాడిస్ చారియట్ రేస్‌లో ఘనవిజయం సాధించాడు. ఒలింపిక్ పోటీలో ఏడు చారియట్లను నడిపి రికార్డు సృష్టించాడు. ప్రథమ విజేతగా రావడమేకాదు. రెండవ నాలగవ స్థానాలను కూడా అతడే దక్కించుకున్నాడు.




ఒలింపిక్ క్రీడలను వినోదక్రీడలుగానే కాకుండా బ్రహ్మాండమైన ఆనందోత్సవాలుగానూ జరుపుకునేవారు. తమకు ప్రీతిపాత్రులయిన క్రీడాకారుల శక్తిసామర్థ్యాలను తిలకించడానికి 70,000 మందికి పైగా ప్రేక్షకులు క్రీడాస్థలికి చేరేవారు!






ఆధునిక కాలంలో లాగా ప్రాచీన ఒలింపిక్స్‌లో పతకాలు, బహూకరించేవారు కాదు. ఆలివ్ పత్రాలు గుచ్చిన వలయాన్ని విజేత తలపై పెట్టేవారు. విజేతలు వాటిని గొప్ప గౌరవంగా భావించేవారు.






క్రీ.శ. 67 నాటికి గ్రీసుదేశానికి చెందని ఇతరులు కూడా ఒలింపిక్ పోటీలలో పాల్గొనసాగారు. విజేతలకు ఆలివ్ పత్రాల వలయాలు తృప్తిని కలిగించలేదు.







రోమనులు గ్రీసు దేశాన్ని జయించాక, ఒలింపిక్ క్రీడలను అమితోత్సాహంతో నడపసాగారు. వాళ్ళు ఒలింపిక్స్‌లో ప్రవేశించి బానిసల మధ్య చావో గెలుపో తేల్చే ఖడ్గ యుద్ధం వంటి భీతావహమైన పోటీలను ప్రవేశపెట్టారు.






క్రీ.శ. 67 లోనే ఒలింపిక్స్ ఒక విధంగా ఆధునికం అయ్యాయని చెప్పవచ్చు. కొన్ని పోటీల న్యాయ నిర్ణేతలకు ఆనాడే లంచాలు ఇవ్వడం జరిగింది!

రోమ్ నగరం తగలబడిపోతూంటే ఫిడేలు వాయించిన నీరో చక్రవర్తే న్యాయనిర్ణేతకు మొట్టమొదట లంచం ఇచ్చాడు. పది గుర్రాలు పూన్చిన చారియట్‌లో కూర్చుని ఆయన చారియట్ రేస్‌లో పాల్గొన్నాడు. ఆయన చారియట్ దారితప్పి పడిపోయింది. గమ్యం చేరనేలేదు. అయినా ఆయనే విజేతగా ప్రకటించబడ్డాడు.












ఒలింపిక్ క్రీడలకు జన్మస్థానం అయిన గ్రీసుదేశం ఒలింపియా నగరంలోనే ఆధునిక ఒలింపిక్ క్రీడోత్సవాలు ప్రారంభించాలని బేరన్ ఆశించాడు. అయితే ఒలింపియాలో ఆధునిక సౌకర్యాలు లేవు. పైగా అది సులభంగా చేరుకోగల ప్రాంతం కూడా కాదు.






1896వ సం॥లో ప్రథమ ఆధునిక ఒలింపిక్స్‌ను ఏథెన్స్ నగరంలో ప్రారంభించాలని నిర్ణయించారు.

ఒలింపిక్ క్రీడామైదానాన్ని బాగు చేయడానికి 9,20,000 బంగారు 'డ్రాచ్మాస్' విరాళంగా ఇచ్చిన ప్రముఖ గ్రీకు వ్యాపారవేత్త జియార్గోస్ ఏవరోఫ్ ఉదారగుణం లేకుంటే - ప్రథమ క్రీడోత్సవాలు సాధ్యపడేవి కావు.




సుప్రసిద్ధ గ్రీకు కవి కోస్టిన్ పాలమాస్ రచించి, స్పైరోస్ సామరాస్ సంగీతం సమకూర్చిన ఒలింపిక్ గీతంతో ప్రథమ ఆధునిక ఒలింపిక్ క్రీడలు ప్రారంభమయ్యాయి.

ఆహా ! ఒలింపిక్స్ అంతమైపోయాయను కున్నాను. కానీ.....

కావ్యదేవతసే వీళ్ళు మించిపోగలరు.




ఏథెన్స్‌లో జరిగిన ప్రథమ ఆధునిక ఒలింపిక్స్‌లో ప్రథమ విజేత అమెరికాకు చెందిన జేమ్స్ కెనోలీ. 'ట్రిపిల్ జంప్'లో అతడు గెలుపొందాడు.






క్రీడలన్నిటికీ మకుటాయమానమైనది మారథాన్ పరుగు పందెం. గ్రీకు పందాలన్నిటికీ ఇది తలమానికంలాంటిది. దీనిని గ్రీసుకు చెందిన స్పైరిడాన్ లూయిజ్ గెలుచుకున్నాడు. ఆయన స్టేడియం లోకి ప్రవేశించగానే జార్జ్, నికొలస్ అనే రాజకుమారులు ఆయనకు ఇరు వైపులా ఆఖరి గీతవరకు పరిగెత్తి గౌరవించారు. ఒక గ్రీకు క్షురకుడు ఆయనకు జీవితాంతం ఉచితంగా గడ్డం గీస్తానని మాట ఇచ్చాడు. ఒక గ్రీకు భోజనశాల యజమాని జీవితాంతం ఆయనకు ఉచితంగా భోజనం పెడతానని వాగ్దానం చేశాడు.

























లండన్ ఒలింపిక్స్‌లోనే ఉత్తమ విజేతను బంగారు పతకంతో సత్కరించడం ఆరంభమయింది.





ఇంగ్లాండు అమెరికాల మధ్య జరిగిన ఒక అవాంఛనీయమైన సంఘటన క్రీడలను కళంకితం చేశాయి. 400 మీ॥ ఫైనల్స్‌లో అమెరికా రన్నర్ కార్పెంటర్ ఇతరులకు అడ్డుతగిలాడని అతన్ని అనర్హుణ్ణి చేశారు. మళ్ళీపరిగెత్తాలన్నారు. అందుకు అమెరికన్లు ఒప్పుకోలేదు. ఇంగ్లాండుకు చెందిన హాల్స్ వెల్లీకి బంగారు పతకం లభించింది. రెండవసారి పరుగులో...

.... ఆయనకు ప్రత్యర్థులే లేకపోయారు!



1912వ సంవత్సరంలో స్టాక్‌హోంలో జరిగిన ఐదవ ఒలింపిక్ క్రీడలు సాంకేతికంగా ముందడుగు వేశాయి. న్యాయనిర్ణేతలకు ఎంతో ఉపయోగకరమైనఎలక్ట్రిక్ టైమింగ్ పరికరాలూ, ఫోటో ఫినిషింగ్ పరికరాలూ అందుబాటులోకి వచ్చాయి. అమెరికన్ క్రీడాకారుడు జిమ్‌థార్పే 'పెంటాథ్లాన్', 'డెకోథ్లాన్' పోటీల్లో తన అద్భుతమైన సామర్థ్యన్ని ప్రదర్శించి అందరి దృష్టినీ ఆకర్షించాడు.



1916లో ఆరవ క్రీడలు జర్మనీలోని బెర్లిన్‌లో జరపాలని నిర్ణయించారు. కానీ, 1914వ సం॥లో మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభం కావడంతో అవి ఆగిపోయాయి.




యుద్ధానంతరం క్రీడలు మళ్ళీ ఆరంభమయ్యాయి. 1920లో జరిగిన యాంట్వర్ప్ ఒలింపిక్స్‌లోనే ఐదు వలయాల ఒలింపిక్ పతాకం ఆవిష్కరించబడింది. డెల్ఫీ ఆలయం లోని ఐదు వలయాల చిహ్నం ఈ పతాక రూపకల్పనకు ప్రేరణనిచ్చింది. భిన్నవర్ణాలలో ఒకదాని కొకటి తగిలించబడినట్లున్న ఐదు వలయాలు ప్రపంచం లోని ఐదు ప్రాంతాలను సూచిస్తాయి.




బెల్జియన్ ఖడ్గవీరుడు విక్టర్ బాయిన్ ప్రప్రథమంగా ఒలింపిక్ ప్రమాణం చేశాడు.






1924వ సంవత్సరంలో ఒలింపిక్స్ మళ్ళీ ప్యారిస్‌కు చేరాయి. అంతర్జాతీయ ఒలింపిక్ కమిటీ ప్రెసిడెంటుగా డీ కూ బెర్టిన్ వున్న ఆఖరి క్రీడలు అవి. ఎనిమిదవ ఒలింపిక్స్‌లో పావెనూర్మీ వివిధ పోటీలలో విజేతగా అందరి దృష్టినీ ఆకర్షించాడు. ఫిన్లాండుకు చెందిన ఆయన 1920, 1924 మరియు 1928లో అథ్లెటిక్స్ అన్ని బహుమతులూ గెలుచుకున్నాడు. ప్యారిస్‌లో 1500, 5000, 10,000 మీ॥గెలిచాడు. పాత రికార్డులను అధిగమించామా లేదా అని తెలుసుకోవడానికి ఆయన పరుగుపందాలలో పరిగెత్తుతున్నప్పుడు కూడా చేతిలో స్టాప్‌వాచ్‌ని తీసుకువెళ్ళేవాడు.









1932లో ఒలింపిక్స్ మళ్ళీ అమెరికాలోని లాస్ ఏంజెలెస్‌లో జరిగాయి. ప్రపంచ దేశాల నుంచి వచ్చిన క్రీడాకారులకు వసతి సౌకర్యాలతో బస ఏర్పాటు చేయడానికి ప్రప్రథమంగా 'ఒలింపిక్ విలేజ్' రూపొందించబడింది.







నాజిజం దౌర్జన్యం కారణంగా బెర్లిన్‌లో జరిగిన పదకొండవ ఒలింపిక్స్‌కు అంతరాయం కలిగింది. ఎక్కడ చూసినా నాజీ జెండాలు కనిపించాయి. ఎటు తిరిగినా "హిట్లర్ వర్ధిల్లాలి!" నినాదాలు మారుమోగాయి!







గ్రీసులోని ఒలింపియాలో వెలిగించుకున్న కాగడాను పరుగువీరులు రిలే పద్ధతిలో పరిగెత్తుతూ తెచ్చి, క్రీడలు జరిగే చోట ఒలింపిక్ జ్యోతిని వెలిగించే ముఖ్యమైన సంప్రదాయం కూడా బెర్లిన్‌లోనే ప్రవేశ పెట్టబడింది. యూరప్‌గుండా బెర్లిన్ వరకు 3,075 మంది వీరులు పరిగెత్తవలసి వచ్చింది.
Greece


బెర్లిన్ ఒలింపిక్స్‌లో తెల్లవాడుకాని అమెరికన్ జెస్సీ ఓవెన్ అందరినీ అధిగమించాడు. 100 మీ॥, 200 మీ॥ లాంగ్‌జంప్ స్ప్రింట్ రిలేలో ఆయన 4 బంగారు పతకాలు సాధించాడు. ఆర్యన్ ఆధిక్యతను ప్రచారం చేస్తున్న హిట్లర్‌కు ఇది కంటకప్రాయమయింది.


రా...రా నీలో నిర్మలమైన అర్యుల రకం ప్రసరిస్తోంది.


ఆర్యులా! అంటే అర్థమేమిటో మరి?


రెండవ ప్రపంచయుద్ధం (1939–1945) కారణంగా రెండు ఒలింపిక్ క్రీడోత్సవాలు అంటే – 1940లో ఏర్పాటు చేయాలనుకున్న టోక్యో ఒలింపిక్స్, 1944లో ఏర్పాటు చేయాలనుకున్న లండన్ ఒలింపిక్స్ రద్దయ్యాయి.


రెండవ ప్రపంచయుద్ధానంతరం పద్నాలగవ ఒలింపిక్ క్రీడలు 1948లో లండన్‌లో జరిగాయి. నెదర్లాండ్స్‌కు చెందిన ఇద్దరు పిల్లల తల్లి అయిన ఫ్యానీ బ్లాంకర్స్ కియిన్ అనే ముప్ఫైయేళ్ళ గృహిణి – అంతకు ముందెన్నడూ మరే స్త్రీ కూడా సాధించని ఘన విజయాలను సాధించి అందరి దృష్టినీ ఆకర్షించింది. 100 మీ॥, 200 మీ॥, 8 మీ॥ హర్డిల్స్‌లోనూ 4X100 రిలే లోనూ విజయం సాధించింది.


అదిగో ఆమె అక్కడ నాలుగో బంగారు పతకం సాధించింది!
మమ్మీ! మమ్మీ!
అమ్మ నీ కోసం పాప్‌కార్న్ కొనడానికి వెళ్ళి వుంటుంది. వచ్చేస్తుంది. ఏడవకు!




1952లో హెల్సింకీలో జరిగిన పదిహేనవ ఒలింపిక్స్‌లో జెకోస్లావియాకు చెందిన ఎమిల్ జాటోపెక్‌కేసి అందరూ వింతగా చూడసాగారు! అసాధారణమైన చేష్టలతో, విచిత్ర ముఖ భావాలతో అతను మిగిలిన క్రీడాకారులకన్నా భిన్నంగా కనిపించాడు. 5,000 మీ॥, 10,000 మీ॥, ఇంకా మారథాన్‌లో మొదటివాడుగా వచ్చి, మూడు విజయాలను సాధించిన తొలి అథ్లెట్ అయ్యాడు.


ఛీ, ఛీ! అతను ముఖాన్ని ఎందుకలా వంకర్లు తిప్పుతూ నాకేసి చూస్తున్నాడు?
903


ఒలింపిక్ క్రీడలు యూరప్, అమెరికా తీరాలను వదిలి తొలిసారిగా ఆస్ట్రేలియాలో అడుగు పెట్టాయి. 1956లో ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్‌లో ఒలింపిక్స్ జరిగాయి. ఈ క్రీడల ప్రత్యేకత ఏమంటే – గుర్రపుస్వారీకి సంబంధించిన క్రీడల పోటీలు మాత్రం దేశానికి వెలుపల, అంటే – స్వీడెన్‌లోని స్టాక్‌హోమ్‌లో జరిగాయి. విదేశాలనుంచి గుర్రాలను తీసుకురాకూడదనే విచిత్రమైన అశ్వ నిషేధచట్టాలు ఆస్ట్రేలియాలో అమలులో ఉండేవి.


ఇతర దేశాలనుంచి మనుషులు రావచ్చు! ఫరవాలేదు. అయితే జంతువులు మాత్రం అడుగుపెట్టకూడదు!


1960వ సం లో రోము నగరంలో జరిగిన పదిహేడవ ఒలింపిక్స్‌లో, తెల్లవాళ్ళు కాని ఇద్దరు క్రీడాకారులు అందరి దృష్టినీ ఆకర్షించారు. ఎథియోపియా నుంచి వచ్చిన అబీబ్ బికిలా అనే బేర్‌ఫుట్ రన్నర్ మారథాన్ పరుగు పందెంలో విజయం సాధించి – 2 గంటల 15 నిమిషాల 16.2 సెకనుల వరల్డ్ బెస్ట్ టైమ్ రికార్డు సృష్టించాడు. ఆఫ్రికన్ క్రీడాకారులకు, వేగంగా పరిగెత్తే జీబ్రాల పక్కన పరిగెత్తించి శిక్షణనిస్తారని చెబుతారు.


ఇదేం పెద్ద విషయం కాదు! మా దేశం తిరిగి వెళ్ళాక జీబ్రాలతో పరిగెత్తే వేగం చూడాలి!




1964లో ఒలింపిక్స్ జపానులోని టోక్యోకు వచ్చింది. ఆ విధంగా ఒలింపిక్స్‌కు ఆతిథ్యమిచ్చిన తొలి తూర్పుదేశం అనే విశిష్టతను జపాను సంతరించుకున్నది. క్రీడలు ఎంతో ఉత్సాహంగా జరిగాయి. వర్షం కురుస్తున్నప్పటికీ క్రీడా ప్రాంగణాలనుంచి జపాను ప్రేక్షకులు కదలలేదు.












అమెరికాకు చెందిన డిక్ ఫాస్బరీ - హైజంప్ బార్ మీదికి వెనకవైపుగా అంటే వీపుమీదుగా ఎగిరి, కాళ్ళను పైకెత్తి అవలికి దూకే నూతన పద్ధతిని కనుగొన్నాడు. దీనిని 'ఫాస్బరీ ఫ్లాప్' అని అంటారు. ఈ నూతన పద్ధతిని ఒలింపిక్స్‌లో ప్రవేశపెట్టడం ఇక్కడ ప్రధాన ప్రత్యేకతగా చెబుతారు!







హ్యానెస్ కోలెమేనన్ (1912) ఎమిల్ జాటోపెక్ (1952) వ్లాడ్‌మీర్ కుట్జ్ (1956) 10,000 మీ॥ 5,000 మీ॥ విజయం సాధించారు. వాళ్ళ తరవాత ఇప్పుడు ఈ పోటీలలోనే ఫిన్లాండుకు చెందిన లాసావిరే ఆ విజయాలను సాధించాడు. శిక్షణాకాలంలో ఆయనకు (రియిన్ డీర్) ఫిన్లండ్ జింకపాలు ఎక్కువగా ఇచ్చారు.



ఉగాండా నుంచి వచ్చిన మరొక ఆఫ్రికన్ జాన్ అకీబువా 100 మీ॥ హర్డిల్స్‌లో బంగారు పతకం సాధించి, అథ్లెటిక్స్‌లో తన అద్భుత ప్రతిభను కనబరచాడు.






రాజకీయాలు ఒలింపిక్స్‌ను వేధిస్తూనే ఉన్నాయి. 1980లో మాస్కోలో జరిగిన ఒలింపిక్స్‌లో అమెరికా, పాకిస్తాన్, జర్మనీ, ఆస్ట్రేలియా, హాలండ్ వంటి దేశాలు పాల్గొనలేదు. ఇంగ్లాండుకు చెందిన 'మిడిల్ డిస్టాన్స్ రన్నర్స్' అయిన స్టీవ్ ఓవెట్, సైబస్టియన్‌కోన్ మధ్య వున్న పోటాపోటీ ఈ క్రీడలలో హైలైట్‌గా అందరి దృష్టినీ ఆకర్షించింది. ఓవెట్ 800 మీ॥ లోనూ కోన్ 1500 మీ॥ లోనూ విజయం సాధించారు.




1984లో లాస్ ఏంజిలెస్‌లో జరిగాయి. దెబ్బకు దెబ్బలా సోవియట్ రష్యా, దాని మిత్ర దేశాలు క్రీడలను బహిష్కరించాయి. 1936లో జెస్సీ ఓవెన్స్ అథ్లెటిక్స్‌లో నాలుగు ఒలింపిక్ బంగారు పతకాలను జయించి, సృష్టించిన రికార్డును, ఈ క్రీడలలో అమెరికాకు చెందిన కార్ల్‌లూయిస్ అందుకున్నాడు. అతడు 100 మీ॥, 200 మీ॥లాంగ్‌జంప్, 4 X 1000 రిలేలో నాలుగు బంగారు పతకాలు సాధించాడు.



1988 లో జరిగినసియోల్ ఒలింపిక్స్‌లో కెనడాకుచెందిన 100 మీ॥ బంగారు పతకం విజేత బెన్‌జాన్సన్ మాదక ద్రవ్యాల పరీక్షలో దోషిగా పట్టుబడడంతో బంగారు పతకాన్ని వెనక్కు తీసేసుకున్నారు. అప్పటి నుంచి పని శక్తిని పెంచే మాదకద్రవ్యాలను అరికట్టడానికి కఠినచర్యలు తీసుకున్నారు. క్రీడలకు ముందు దాదాపు 100రకాల 'డ్రగ్స్' మీద నిషేధం విధించారు. మాదకద్రవ్యాలు పుచ్చుకున్నారా అని పరిశోధించడానికి ఆధునాతన పద్ధతులు ప్రవేశ పెట్టారు.






1992లో జరిగిన బార్సిలోనా క్రీడలలో మళ్ళీ అసలైన ఒలింపిక్ స్ఫూర్తి తలెత్తి సాగింది. ప్రపంచ దేశాలన్నీ పాల్గొన్నాయి. ఈస్టోనియా, లాట్వియా లాంటి చిన్నదేశాలు కూడా కార్యరంగంలోకిదిగాయి!

ఉక్రేనియాకు చెందిన సెర్గీ బూబ్కా, ఒకప్పుడు పోల్‌వాల్ట్‌లో ప్రపంచరికార్డు సృష్టించిన క్రీడాకారుడు. ఆయన బార్సిలోనాలో ఒక్కసారి కూడా పోల్‌వాల్ట్ బార్ దగ్గరికి రాలేక పోవడం క్రీడాభిమానులకు విస్మయం కలిగించింది!




సహస్రాబ్ది చివరి క్రీడోత్సవాలు మళ్ళీ అమెరికాకు తిరిగి వచ్చాయి. 1996లో అట్లాంటాలో జరిగిన క్రీడలు విలక్షణమైనవి. ఎందుకంటే పూర్తిగా ప్రైవేట్ నిధులతో ఏర్పాటు చేసిన ప్రథమ ఒలింపిక్ క్రీడలు అవి!




ఒలింపిక్ క్రీడలు వేగం పుంజుకున్నాక - స్కీయింగ్, స్కేటింగ్, బ్యాగోనింగ్, బాబ్స్లేన్ మొదలైన శీతాకాలపు క్రీడలలో నైపుణ్యం పెంపొందించడానికి వింటర్ ఒలింపిక్స్ జరపడం అవసరం అనిపించింది. 1924 నుంచి వింటర్ ఒలింపిక్స్ నిర్వహిస్తున్నారు. వేసవి క్రీడలకు మధ్య నాలుగేళ్ళకోసారి వాటిని జరుపుతున్నారు.


వికలాంగులైన వారి కోసం ప్రత్యేకంగా జరిపే పేరాలింపిక్స్ లేదా స్పెషల్ ఒలింపిక్స్ కూడా క్రీడాభి మానుల క్యాలండర్లలో చోటు సంపాదించాయి.


సెప్టెంబర్ 2000 రాగానే ప్రపంచం దృష్టి సిడ్నీపై కేంద్రీకృతమవుతుంది. నూతన సహస్రాబ్ది తొలి ఒలింపిక్ క్రీడోత్సవాలకు వేదిక ఆస్ట్రేలియా లోని అందాల సిడ్నీనగరం!


ఒలింపిక్స్‌కు తొలి ప్రచారంగా ఒలింపిక్ చరిత్రలో ప్రప్రథమంగా ఒలింపిక్ జ్యోతిని కొంతదూరం నీళ్ళలోపల తీసుకువెళ్ళారు. ఆస్ట్రేలియాలోని జలాంతర్గత శిలాసంపద (గ్రేట్ బ్యారియర్ రీఫ్)ను ప్రపంచానికి చాటడానికి ఈ ఏర్పాటు చేశారు!


ఒలింపిక్స్ ముందుముందు అంటే మరో వెయ్యేళ్ళలో మరెన్నెన్ని నూతన రూపాలు ధరించనున్నదో చూడాలి!




MARS




గ్రహాంతర సీమల ప్రయాణం సాధ్యమై, 3000 సం॥ నాటికి అంగారకగ్రహంలోనే ఒలింపిక్ క్రీడలు జరుగుతాయేమో!




1. 100 మీ॥ ఈతపందాన్ని ఒక నిమిషం లోపల ఈదిన మొట్టమొదటి ఈతగాడు ఎవరు?
2. అతడు ఒక కాలశకలాన్ని స్తంభింపజేసి దానిని భావి తరాలకు ఫిలింలో భద్రపరచాడు! అది 1936 బెర్లిన్ ఒలింపిక్స్‌లో జరిగింది. వీడియో రికార్డు చేసిన తొలి ఒలింపిక్స్ అదే. మొట్టమొదటి వీడియో తీసిన వ్యక్తి ఎవరు?
3. 1500 మీ॥ రికార్డు టైములో పరిగెత్తి 'జింక మనిషి' అని బిరుదు పొందిన ఆస్ట్రేలియన్ పరుగువీరుడు ఎవరు?
4. 65యేళ్ళ వయసులోనూ పోటీలో పాల్గొని తన దేశం బంగారు పతకం సాధించడానికి సాయంచేసిన పెద్దమనిషి ఎవరు?
5. భారత హాకీ జట్టు ప్రప్రథమంగా ఎప్పుడు బంగారు పతకం సాధించింది? మొదటిసారిగా ఎప్పుడు పోగొట్టుకున్నది?
6. కాగడాను వెలిగించి ఒలింపిక్ జ్యోతిని మొదటి రన్నర్‌కి ఇచ్చారు. అతడు పరుగెత్తుతూ తీసుకెళ్ళి రెండవ రన్నర్ చేతనున్న కాగడాను వెలిగించాడు. రిలే పద్ధతిలో అది క్రీడలు జరిగే గమ్యస్థానం చేరుకోవాలి. అయితే మూడవ రన్నర్ కాగడాతో నిలబడ్డాడేగాని, ఒలింపిక్ జ్యోతి ఎంత సేపటికీ రాలేదు. ఒలింపిక్ చరిత్రలో మొట్టమొదటి సారిగా ఒలింపిక్ జ్యోతి దొంగిలించబడింది! అది ఎప్పుడు జరిగింది?
7. 1996 అట్లాంటా ఒలింపిక్స్‌లో బహూకరించబడిన పతకాలు మిగతా ఒలింపిక్ క్రీడోత్సవాలలో బహూకరించిన వాటికన్నా భిన్నమైనవి. అవి ఎలా భిన్నమైనవో తెలుసా?
8. మార్క్ స్పిట్జ్ ఒలింపిక్ ఖ్యాతికి కారణం ఏమిటి?
9. హైజంప్‌లో 28 అడుగుల బేరియర్‌ను అధిగమించిన తొలి వీరుడాయన. ప్రప్రథమంగా పోటీలలో పాల్గొన్నప్పుడే 29 అడుగులా 2½ అంగుళాల ఎత్తు దూకాడు. ఆయన ఎవరు?
10. ఒంటరిపోటీలో ఒలింపిక్ పతకం సాధించిన ఏకైక భారతీయుడు ఎవరు?

1. అమెరికాకు చెందిన జానీవీస్‌ముల్లర్. ఆయనే అటుతరవాత టార్జాన్‌గా ప్రఖ్యాతిగాంచాడు.
2. లేనీ రీఫెన్‌స్టాల్.
3. ఆస్ట్రేలియాకు చెందిన హెర్బ్ ఇలియట్. 1960 రోమ్ ఒలింపిక్స్‌లో ఆయన 1500 మీ॥లను 3 నిముషాల 35.6 సెకన్ల రికార్డు కాలంలో పరిగెత్తాడు.
4. స్వీడిష్‌కు చెందిన ఆస్కార్ స్వాన్. ఆయన 1912 స్టాక్‌హోమ్ ఒలింపిక్స్ పరుగు పందెంలో పాల్గొని, గెలిచి, తన జట్టు చాంపియన్‌షిప్ సాధించడానికి సాయపడ్డాడు.
5. భారత హాకీ జట్టు 1928 ఆమ్‌స్టర్‌డ్యామ్ ఒలింపిక్స్‌లో బంగారు పతకం సాధించింది. 1960 రోమ్ ఒలింపిక్స్‌లో పోగొట్టుకున్నది.
6. 1992 బార్సిలోనా ఒలింపిక్స్‌లో ఒలింపిక్ జ్యోతి దొంగిలించబడింది.
7. పతకాలకు ఒకవైపున వారు విజయం సాధించిన పోటీకి సంబంధించిన బొమ్మ, మరొకవైపున ఐదు వలయాల ఒలింపిక్ చిహ్నం ఉండేలా తయారు చేశారు.
8. 1972 మ్యూనిక్ ఒలింపిక్స్‌లో మార్క్‌స్పిట్జ్ ఈత పోటీలలో ఏడు బంగారు పతకాలు సాధించి, ఏడు రికార్డులను అధిగమించాడు.
9. 1968 మెక్సికో ఒలింపిక్స్‌లో బాబ్ బీమోన్.
10. 1900 ప్యారిస్ క్రీడలలో 200 మీ॥ వెండి పతకం సాధించిన నార్మన్ ప్రిట్చర్డ్.

# క్రీడల క్విజ్






ఇవి కొన్ని సుప్రసిద్ధమైన ఒలింపిక్ క్రీడలు. వాటిని మీరు గుర్తించగలరా?

సమాధానాలు : తరవాతి పేజీలో

---

వివిధ దేశాల పతాకాలను మీరు గుర్తించగలరా? అలా అయితే, ఇక్కడ ఉన్న పతాకాలు ఏ ఏ దేశాలకు చెందినవో చెప్పండి చూద్దాం. దాంతోపాటు ఇక్కడవున్న మస్కట్స్ (అదృష్టచిహ్నాల)ను కూడా గుర్తించాలి. ఏ ఏ ఒలింపిక్ క్రీడలలో ఇవి ప్రేక్షకులను అలరించాయో చెప్పగలరా? మస్కట్స్‌ను క్రీడలు జరిగిన ఆయా దేశాల పతాకాలతో జత చేయండి చూద్దాం!

సమాధానాలు : తరవాతి పేజీలో









# దారి చూపగలరా?

సమీర్‌కు ఒలింపిక్ జ్యోతిని వెలిగించే అపూర్వ అవకాశం లభించింది. అయితే అప్పటికే క్రీడాప్రాంగణంలో రకరకాల క్రీడలు జరుగుతున్నాయి. అతడు వాటిగుండా జాగ్రత్తగా దారి వెతుక్కుంటూ వెళ్ళి జ్యోతిని వెలిగించాలి. సమీర్, జ్యోతి వున్న స్థలాన్ని చేరుకోవడానికి మీరు దారి చూపి సాయం చేయగలరా? ప్రయత్నించండి!







సమాధానాలు :

## క్రీడల క్విజ్

1. రిలే రేస్. క్రీడాకారుడి చేతనున్న బెత్తాన్ని గమనించండి.
2. స్ప్రింట్.
3. జిమ్నాస్టిక్స్ – ఫ్లోర్ ఎక్సర్‌సైజెస్.
4. హైజంప్.

## మస్కట్ మ్యాచ్

1. వాల్డీ, కుక్క – కెనడాలోని మాంట్రియల్‌లో జరిగిన 1976 ఒలింపిక్స్ మస్కట్.
2. కోబి, పిల్లి – స్పెయిన్‌లోని బార్సిలోనాలో జరిగిన 1992 ఒలింపిక్స్ మస్కట్.
3. హొడోరీ, పులి – దక్షిణ కొరియా సియోల్‌లో జరిగిన 1988 ఒలింపిక్స్ మస్కట్.
4. ఓల్లీ, మిల్లీ, సిడ్ – కూకబుర్రా, ఎకిడ్నా, ప్లాటిపస్ –సిడ్నీలో జరుగనున్న 2000 ఒలింపిక్స్ మస్కట్స్.



# దొంగ- ఆత్మగౌరవం

**కా**యకష్టం చేసుకుని బ్రతికే వెంకన్నకు తాగుడు, జూదం అలవాటయ్యాయి. అప్పటి నుంచీ వాడు సంపాదించిన డబ్బంతా చెడు అలవాట్లకే ఖర్చు చేసేవాడు. వాడి భార్యా బిడ్డలు తిండికి లేక మలమల మాడుతున్నారు. అయినా వాడు పట్టించుకోలేదు.

ఇలావుండగా, ఒకరోజున వెంకన్నకు జ్వరం వచ్చింది. ఒంట్లో సత్తువంతా నశించి, మంచం మీది నుంచి కూడా లేవలేకపోయాడు. భార్య గౌరమ్మ వైద్యుణ్ణి పిలవబోతే, ఆయన డబ్బు కావాలన్నాడు. అప్పు కోసమని ఎవరింటికి వెళ్ళినా పాతబాకీలు తీర్చమన్నారు. భర్త ఇంటి ఖర్చులకు డబ్బివ్వకపోవడంతో గౌరమ్మ ఇంటి అవసరాలు గడుపుకునేందుకు, చాలా ఇళ్ళల్లో అప్పులు చేసిందిమరి!

ఆ ఊరికి కొత్తగా దయామయుడనే భాగ్యవంతుడు వచ్చాడు. ఆయన ఊళ్ళోని కొన్ని కొబ్బరితోటలు, ఫలవృక్షాల తోటలు కొన్నాడు. చిన్న చిన్న పరిశ్రమలు పెట్టి చాలా మందికి పని కల్పిస్తున్నాడు. దయాగుణ మున్నవాడని నలుగురూ చెప్పుకుంటున్నారు. గౌరమ్మ తనకు సాయపడగలడేమో అని ఆయనను చూడబోయింది.

"నీ అప్పులు తీరుస్తాను. నీ భర్తకు వైద్యం చేయిస్తాను. తర్వాత అతడు నా దగ్గర పనిచేయాలి. నేను పెట్టే నియమాలకు లోబడివుండాలి. ఇష్టమైతే చెప్పు!" అన్నాడు దయామయుడు.

గౌరమ్మకు వేరే దారేముంది. ఆమె కాయన మాటలు, అమృతంతో సమానంగా తోచాయి. వెంటనే అంగీకరించింది.

దయామయుడు మాటలతో తృప్తిపడక, అప్పటికప్పుడు పత్రాలు తయారు చేయించి, వాటిపై గౌరమ్మ చేవ్రాలు తీసుకున్నాడు.

"వసుంధర"



తర్వాత తన మనుషులను పంపి, వెంకన్నను తన ఇంటి ఆవరణలోని వైద్యశాలలో చేర్చి, సరైన వైద్యం చేయించాడు. వెంకన్నకు నాలుగు రోజుల్లో పూర్తిగా నయమై, మామూలు మనిషి అయ్యాడు. అతడు దయామయుడికి దణ్ణం పెట్టి కృతజ్ఞతలు చెప్పుకుని సెలవుతీసుకో బోయాడు.

" ఎక్కడికి వెళతావు? నువ్వు నా దగ్గర పనిచేయాలి," అన్నాడు దయామయుడు.

వెంకన్న ఒప్పుకోలేదు. కానీ దయామయుడికి తోడుగా వున్న బలగాన్ని చూసి, ఆయన బారినుంచి తప్పించుకోవడం అంత సులభం కాదని అర్థం చేసుకున్నాడు.

రోజూ ఉదయమే లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాక, అతడికి చద్దన్నం పెట్టేవారు. నాలుగు గంటలు ఏకధాటిగా పనిచేశాక, గౌరమ్మ ఇంటి వద్ద వండి తెచ్చిన అన్నం పెట్టేది. కాసేపు విశ్రాంతి తీసుకున్నాక, మళ్ళీ నాలుగు గంటల పని. రాత్రి మళ్ళీ భార్య భోజనం తెచ్చిపెట్టేది. భార్యాబిడ్డలతో కొద్ది సేపు గడిపే అవకాశం కూడా అప్పుడే అతడికి వుండేది.

అంతాబాగానే వున్నది కానీ, దయామయుడు, వెంకన్న తొడుక్కునేందుకు కారాగారంలో వుండే దొంగలు ధరించే చారల దుస్తులు ఇచ్చాడు. అవి ధరించడం అతడికెంతో అవమానంగా తోచేది.

ఆ విధంగా నెలరోజులు గడిచాయి. పని చేసినందుకు వెంకన్నకు రావలసిన జీతం డబ్బులను, గౌరమ్మకిచ్చాడు దయామయుడు. ఆ రోజున వెంకన్న, గౌరమ్మ దగ్గర భోరున ఏడ్చి, " నీ పని బాగానే వుంది కానీ, నాకిక్కడ దొంగ బ్రతుకైపోయింది. నేను తొడిగేవి దొంగవాడి బట్టలు. నేనుంటున్నది కారాగారం. ఇక్కడి నుంచి నువ్వు నన్ను తప్పించు!" అన్నాడు.

గౌరమ్మక్కూడా భర్త స్థితి చూసి జాలి వేసింది. ఆమె దయామయుణ్ణి కలుసుకుని, "అయ్యా! తమరు చేసిన సాయానికి ఎంతో కృతజ్ఞురాలిని. సమయానికి దేవుడిలా ఆదుకుని నా భర్తను కాపాడారు. కానీ ఇప్పుడు తమరు నా భర్తను దొంగను చేసి అవమానిస్తున్నారు. ఇది నాక్కూడా ఎంతో బాధగా వుంది. కావాలంటే అతడి స్థానంలో నేను పనిచేస్తాను. అతడికి స్వేచ్ఛ ఇవ్వండి. లేదా కనీసం మంచి దుస్తులు వేసుకోనివ్వండి," అని వేడుకున్నది.

దయామయుడు దేనికీ అంగీకరించక, "అంతా పత్రాల్లో వున్న ప్రకారమే జరుగు

తున్నది. ఈ విషయమై ఇంకెన్నడూ నాదగ్గర మాట్లాడవద్దు,'' అని ఆమెను మందలించి పంపేశాడు.

రోజూ గౌరమ్మ భోజనం తెచ్చినప్పుడల్లా వెంకన్న గోడుగోడున ఏడుస్తూ, ''భార్యను అమ్ముకున్న భర్త గురించి పురాణాల్లో విన్నాం. కానీ నువ్వు నీ స్వార్థం కోసం, జ్వరంతో స్పృహలేని స్థితిలో వున్న భర్తను అమ్ముకుని, మరొక కొత్త పురాణ కథ సృష్టించావు. నన్ను అమ్ముకునే హక్కు నీ కెక్కడిది? ఈ అన్యాయాన్ని గ్రామాధికారికి మొరబెట్టుకుందామన్నా, దారిలేకుండా పోయింది, నాకు!'' అంటూండేవాడు.

భర్తకు తనవల్ల అన్యాయం జరిగిందని, గౌరమ్మకూ అనిపించేది. చివరకు ఒక రోజున ఆమె గ్రామాధికారి వద్దకు వెళ్ళి, జరిగిందంతా చెప్పకుని, తన భర్తకు న్యాయం జరిగేలా చేయమని వేడుకున్నది.

గ్రామాధికారి, గౌరమ్మ చెప్పిందంతా విని ఎంతో ఆశ్చర్యపడి, వెంటనే దయామయుడికి కబురుపెట్టి రప్పించి, గౌరమ్మ అతడిపై చేసిన ఆరోపణల గురించి చెప్పాడు.

దయామయుడు ఏమాత్రం తొణక్కుండా, ''నేను అన్నీ ముందుగానే ఆమెకు చెప్పాను. ఆ ప్రకారం పత్రాలు రాయించుకున్నాను. నావల్ల ఆ కుటుంబానికి మేలే జరుగుతున్నది. నేను వెంకన్న చేత మిగతా వారికంటే తక్కువసేపు పనిచేయించుకుని ఎక్కువ జీతం ఇస్తున్నాను. నావల్ల వెంకన్న తాగుడు మానేశాడు. జూదం మానేశాడు. అన్ని ఖర్చులూ పోను, ఆ కుటుంబానికి కొంత డబ్బుకూడా ఆదా అవుతున్నది. ఇలా కొన్నేళ్ళుజరిగితే గౌరమ్మ కాస్త పొలం కూడా కొనుక్కోవచ్చు,'' అన్నాడు.

''మనిషికి డబ్బే ప్రధానం కాదు.అందరూ ఆత్మగౌరవంతో బ్రతకాలనుకుంటారు.



స్వేచ్ఛను కోరతారు. వెంకన్న తన డబ్బుతో తాగినా, జూదమాడినా అది నేరం కాదు. అయినా, అతణ్ణి శాసించడానికి అసలు మీరెవరు?'' అన్నాడు గ్రామాధికారి కోపంగా.

''వెంకన్న దొంగ. ఆ దొంగను శిక్షించ డానికి, మీ న్యాయం ఒప్పుకోదు. అందుకే నేను కలగజేసుకున్నాను,'' అన్నాడు దయా మయుడు.

''వెంకన్న దొంగతనం చేసినట్టు రుజువు చేయండి. వెంటనే, నేనే అతణ్ణి కారాగారంలో వుంచుతాను,'' అన్నాడు గ్రామాధికారి కాస్త చిరాగ్గా.

''అయితే వినండి! మన సమాజంలో ప్రతిపౌరుడికీ కొన్ని బాధ్యతలున్నాయి. తల్లితండ్రులనూ, భార్యాబిడ్డలనూ పోషించడం కూడా వాటిల్లో ఒకటి. ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించిన వాడికే, తన డబ్బును ఇష్టం వచ్చినట్లు ఖర్చు పెట్టుకునే స్వేచ్ఛ వుంటుంది. వెంకన్న తన భార్యాబిడ్డలను పోషించాల్సిన డబ్బును కూడా సొంతానికే వాడుకోవడం వల్ల దొంగ అయ్యాడు. ఆ దొంగను గౌరమ్మ నాకు అప్పచెప్పింది. అతణ్ణి తగిన కట్టుబాట్లలో వుంచి, మామూలు మనిషిని చేసి, ఆస్తి పరుణ్ణి చేయడమే నా ఆశయం. భార్యా బిడ్డలు మలమలమాడుతూంటే, తాగుడూ, జూదాలకు బానిస అయినవాడికి ఆత్మగౌరవ మేమిటి?'' అన్నాడు దయామయుడు.

అప్పటికి విషయం గ్రామాధికారికే కాదు, గౌరమ్మకూ అర్థమైంది. ఆమె దయామయుడికి చేతులెత్తి నమస్కరించి, తప్పుగా అర్థం చేసు కున్నందుకు క్షమించమని కోరింది.

భార్య ద్వారా అసలు విషయం తెలుసు కున్న వెంకన్న, ''అవును, నేను దొంగనే ! దయామయుడు నాకు తగిన మర్యాదే చేశాడు,'' అన్నాడు.

ఆ తర్వాత అతడిలో చాలా త్వరగా మార్పు వచ్చింది. ఏడాది తిరక్కుండా దయామయుడు అతణ్ణి పనిలో వుంచు కున్నాడు కానీ, ఇంటికి వెళ్ళి మామూలు దుస్తులు వేసుకునే స్వేచ్ఛను ప్రసాదించాడు. వెంకన్న మళ్ళీ వ్యసనాల జోలికి పోలేదు.



# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

## డా. సర్వేపల్లి రాధాకృష్ణన్



భారతీయ తత్వశాస్త్ర వైశిష్ట్యాన్ని ఆధునిక ప్రపంచానికి విడమరచి చెప్పిన వారిలో డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ ముఖ్యులు. భారతదేశ అధ్యక్షపదవిని అలంకరించి ఆ పదవికే గౌరవాన్ని సమకూర్చిన మేధావి, రాజనీతివేత్త ఆయన!

చెన్నయ్ నగరానికి సమీపంలోని తిరుత్తణిలో ఒక సాధారణ కుటుంబంలో 1888 సెప్టెంబర్ 5వ తేదీ జన్మించిన రాధాకృష్ణన్, తిరుపతిలో ప్రాథమిక విద్యనూ, మద్రాసులో ఉన్నతవిద్యనూ పూర్తిచేసి మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తత్వశాస్త్ర ఉపన్యాసకులుగా జీవితాన్ని ప్రారంభించారు. ఆ తరవాత కలకత్తా విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర ఉపన్యాసకులుగానూ; 1936-39 మధ్య ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో తూర్పుదేశాల మతాచార్యులు (ప్రొఫెసర్ ఆఫ్ ఈస్టర్న్ రిలిజన్స్) గానూ పనిచేశారు. ఆ తరవాత ఆయన 1948లో కాశీ హిందూ విశ్వ విద్యాలయం వైస్‌ఛాన్సలర్ పదవిని అలంకరించారు.

అప్పటికే ఆయన ఉత్తమశ్రేణి ఉపన్యాసకులుగా, మేధావిగా పేరుగాంచారు. 1949లో ఐక్యరాజ్యసమితి విద్యాసాంస్కృతిక సంస్థ అధ్యక్షులయ్యారు. అయితే, అప్పుడే స్వతంత్రం పొందిన మన దేశానికి ఇతరదేశాలకు సమర్థులైన ప్రతినిధులను పంపవలసిన అవసరం ఏర్పడింది. ఆనాటి ప్రపంచ అగ్రరాజ్యాలలో ఒకటైన సోవియట్‌రష్యాకు భారత రాయబారిగా వెళ్ళారు. అప్పుడా దేశం స్టాలిన్ పాలనలో ఉన్నది. స్టాలిన్ దృష్టిని ఆకర్షించి ఆకట్టుకోవడం అంత సులభం కాదు. అటువంటి స్టాలిన్, రాధాకృష్ణన్ పాండిత్యాన్నీ, రాజనీతిజ్ఞతనూ మెచ్చుకున్నారు. దాని ఫలితంగా భారత్-సోవియట్ రష్యాల మధ్య సంబంధ బాంధవ్యాలు మరింత చేరువయ్యాయి!

ఆ తరవాత రాధాకృష్ణన్ భారత ఉపరాష్ట్రపతి అయ్యారు. 1962లో భారత రిపబ్లిక్ రాష్ట్రపతి పదవీ బాధ్యతలను చేపట్టి, 1967లో పదవీవిరమణ చేసేంతవరకు వాటినెంతో సమర్థవంతంగా, హుందాగా నిర్వహించారు.

ఆయన ఆంగ్లంలో ఎన్నో గ్రంథాలు రచించారు. అవన్నీ కూడా ప్రపంచవ్యాప్తంగా మేధావుల ప్రశంసలను అందుకున్నాయి. ఆయన రచనలలో 'భారతీయ తత్వశాస్త్రం' మరింత ప్రసిద్ధిపొందింది. ఆయన అంటారు : దేవుడు ప్రపంచాన్ని ఎప్పుడో సృష్టించాడని చెప్పడం అంత సరికాదు. ఎందుకంటే ఆయన ఇప్పుడూ, ఎప్పుడూ సృష్టిస్తూనే ఉన్నాడు. ఆ విధంగా చూస్తే చరిత్ర భగవత్ సంకల్పకావ్యం! దైవసాక్షాత్కారం! ఐహిక మాధ్యమంలో ప్రకాశించే దివ్యకృత్యం!

ఉన్నత పదవులెన్నో ఆయన్ను వెతుక్కుంటూ వచ్చాయి. చేపట్టిన ప్రతి పదవికీ గౌరవం చేకూర్చిన డా.రాధాకృష్ణన్ 1975వ సం॥ లో కీర్తిశేషులయ్యారు. ఆదర్శ ఉపాధ్యాయుడుగా, రాజనీతివేత్తగా దేశానికి అమూల్యమైన సేవలందించిన రాధాకృష్ణన్ జన్మదినమైన సెప్టెంబర్ 5ను మనదేశంలో ఉపాధ్యాయుల దినంగా జరుపుకుంటున్నాము.



# పెళ్ళిసమస్య

హేలాపురి నివాసి వీరసత్యుడు, బాగా ఆస్తిపాస్తులున్నవాడు. పది మందిలో మంచి పేరున్న వాడు. ఆయనకు ఒకే కుమారుడు. వాడికి పెళ్ళీడు రాగానే, ఆయన తగిన వధువుకోసం వెదకడం ప్రారంభించాడు. రూపవంతుడు, వినయవంతుడు, మంచి తెలివితేటలున్న తన కుమారుడికి రూపంలో, తెలివితేటల్లో సరితూగే అమ్మాయి భార్యగా తీసుకురావాలని వీరసత్యుడి సంకల్పం.

ఇందుకోసం, ఆయన తన బంధు గణంలో అంతో ఇంతో తానెరిగి వున్న వాళ్ళ కుటుంబాల్లో ప్రయత్నించి చూశాడు. ఐతే, మంచి తెలివితేటలూ, చలాకీతనం వున్న ఆడపిల్లల్లో చాలామంది అందచందాల్లో అంతంత మాత్రంగా వుండడం; అంద చందాలున్న వాళ్ళు తెలివితేటల్లో చెప్పుకో దగినవాళ్ళుగా కనబడకపోవడంతో, ఆయనకు ఏమి చేయడమా అన్నది పాలుపోలేదు.

ఇలా వుండగా– ఒకనాడు వీరసత్యుడి ఇంటికి దూరపుబంధువు శేషశాయి అనే ఆయన చుట్టపు చూపుగా చూడవచ్చాడు. మాటల సందర్భంలో వీరసత్యుడాయనకు, తన కొడుకు పెళ్ళిసమస్య గురించి చెప్పి, ''మా వాడికి తగిన వధువును వెతికి పట్టు కోవడం, ఆరంభంలో నేననుకున్నంత తేలిగ్గా కనబడడంలేదు,'' అంటూ, ఆ ప్రయత్నంలో తనకు ఎదురైనఅనుభవాలు ఏకరువు పెట్టాడు.

అంతా శ్రద్ధగా విన్న శేషశాయి, కొంచెం సేపు ఆలోచించి, ''మగపిల్లవాడిని గాని, ఆడపిల్లనుగాని మనం చూసి, ఇట్టే వాళ్ళ తెలివితేటల్ని గురించి తెలుసుకోవాలంటే, వాళ్ళ మాటలా చేతలా ద్వారానే సాధ్య

కోనే నాగ వెంకట ఆంజనేయులు

పడుతుంది. అంతేగాని, మనం పనిగట్టుకుని వాళ్ళను ఏప్రశ్నలడిగో, పరీక్షలు పెట్టో వాళ్ళ తెలివితేటల్ని అంచనా వేయడం వీలుకాదు గదా!'' అన్నాడు.

వీరసత్త్వుడు ఒక క్షణం ఆగి, ''అవును, నీవన్నది నిజం!'' అన్నాడు.

అంతటితో వాళ్ళిద్దరి మధ్యా, ఆడపిల్లల అందచందాలూ, తెలివితేటల్ని గురించిన సంభాషణ ఆగిపోయింది.

మర్నాడు శేషశాయి బయల్దేరిపోతూ, ''అన్నట్టు సమయానికి గుర్తుకొచ్చింది! సుగంధపురంలో, నేనెరిగిన బాలకృష్ణుడనే ఆయన వున్నాడు. ఆయనకు పెళ్ళీడు వచ్చిన అందమైన కుమార్తె వున్నదని విన్నాను. ఒకసారి అక్కడికి వెళ్ళిరా,'' అని చెప్పి, బాలకృష్ణుడి ఇంటిచిరునామా రాసి ఇచ్చాడు. వారం రోజుల తరవాత, వీరసత్త్వుడు ఆ చిరునామా తీసుకుని సుగంధపురం వెళ్ళి, బాలకృష్ణుడి ఇల్లు వెతుకుతూ, ఒకఇంటిముందు ఆగాడు.

ఆ ఇంటి ముందు అంతా బురదగా వున్నది. ముందురోజు కురిసిన భారీవర్షానికి, ఇంటి ముందు భాగమంతా బురదతో నిండి పోయింది. వీరసత్త్వుడు గత్యంతరం లేక, ఆ బురదలో నుంచే నడిచి, మెల్లగా ఇంటి గుమ్మం ముందుకు చేరాడు. అతడి కాళ్ళ నిండా బురద బాగా అంటుకున్నది.

తనను చూసి ఇంటిలోపలి నుంచి వచ్చిన, ఒక యువతితో, ''అమ్మాయీ, కాస్త నీళ్ళిప్పిస్తే కాళ్ళుకడుక్కుంటాను,'' అన్నాడు వీరసత్త్వుడు.



''అయ్యా, అదిసరే కాని, ఇంతకూ తమరు వచ్చింది, మా ఇంటికే కదా?'' అని అడిగింది ఆ యువతి.

''ఇది బాలకృష్ణుడిగారి ఇల్లే కదా, తల్లీ?'' అని అడిగాడు వీరసత్యుడు.

''అవునండీ, మీకు కావలసిన ఇల్లు ఇదే. ఇవిగోనండి నీళ్ళు. కాళ్ళు కడుక్కుని లోపలికి రండి. మా నాన్నగారు లోపల వున్నారు,'' అన్నదా యువతి, వీరసత్యుడికి కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళుఅందిస్తూ.

వీరసత్యుడు శుభ్రంగా కాళ్ళు కడుక్కుని, ఆ యువతి అందించిన వస్త్రంతో కాళ్ళు తుడుచుకుంటూ, ''తల్లీ, కాళ్ళు కడుక్కోడానికినేను నీళ్ళు అడిగినవెంటనే ఇవ్వకుండా, నేను వచ్చింది మీ ఇంటికే అని విచారించి తెలుసుకున్న తరవాతే ఇచ్చావు. ఇది నాకు చాలా విచిత్రంగా తోస్తున్నది,'' అన్నాడు.

ఈ ప్రశ్నకు ఆ యువతి కాస్త బిడియపడుతూ, '' ఇందులో మీరు విచిత్రం అనుకోవడానికి ఏమీ లేదు. నేను మిమ్మల్ని ఇంతకు ముందు ఏనాడూ చూడలేదు. అంటే మీరు మా ఇంటికి పూర్తిగా కొత్త వారు. మీకు కావలసింది మా ఇల్లు కాక పోతే, మీరు ఎలాగూ వెనక్కి తిరిగి పోక తప్పదు. అప్పుడు కూడా మీరు తప్పని సరిగా, బురదలోంచే నడిచి వెళ్ళాలి. అలాంటప్పుడు కాళ్ళు కడుక్కోవడం ఎందుకు - మీక్కావలసింది మా ఇల్లు కాకపోతే? మీరు వచ్చింది, మానాన్నగారిని కలుసుకోవడానికే అన్న విషయం నిర్ధారించుకున్న తర్వాతే, కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళిచ్చాను,'' అని చెప్పింది.

ఆ జవాబుకు వీరసత్యుడు ఆశ్చర్యపోయాడు. అందంతో పాటు ఇంత తర్కంతో తెలివిగా ఆలోచించే, ఆ యువతే తన కుమారుడికి తగిన వధువని నిశ్చయించుకుని, ఆమె తండ్రితో వివాహవిషయం మాట్లాడేందుకు, ఆ ఇంట్లో అడుగుపెట్టాడు ఆనందంగా.




THE AMUL
CHEESE BOY
IN PICNIC PANIC


One bright sunny day...


...a picnic is in progress.


Little Munnu Verma
crawls away.
GURGLE


Suddenly, huge rocks come
tumbling down the mountain.
RUMBLE


Amul cheese boy eats an
Amul cheese slice...


...and becomes
strong and powerful.


He smashes the
falling rocks...
BANG


...reducing them to small pieces.
CRACK


Munnu is rescued and
back with his family.


All thanks to the cheese
that has more milk in it.


Amul cheese slices.
Amul cheese. Yes please!
Amul

# భారత సంస్కృ

**ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు –**
**తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!**

## 9. తన విధిని మార్చుకున్న పసివాడు!



"తాతయ్యా! పండుగలనూ, పర్వాలనూ మనం అలవాటు ప్రకారం జరుపుకుంటున్నాం. అంతేగాని, వాటి ప్రాముఖ్యతను గురించి మనకు ఎంత వరకు తెలుసు?" అని అడిగింది శ్యామల.

"నిజమేనమ్మా! ప్రతి పండుగకూ ఒక ప్రాముఖ్యత ఉన్నది. అయితే, మనం ఇక్కడ మరొక విషయం కూడా మరిచిపోకూడదు. అదేమిటంటే, పండుగలకూ ఉత్సవాలకూ సంబంధించి, కాలప్రవాహంలో రకరకాల పుక్కిటి పురాణకథలూ, కర్ణాకర్ణిగా చెప్పుకునే ఉదంతాలూ పుట్టుకువస్తాయి. వాటిని మనం యథాతథంగా తీసుకోకూడదు. వాటిలోని అంతరార్థాన్ని మాత్రమే గ్రహించాలి!" అన్నాడు తాత దేవనాథుడు.

"అవునూ, మరి అలాంటి కథలు ఎలా పుట్టుకువస్తాయి తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు.

"చాలా కారణాలు ఉన్నాయి. ప్రధానంగా మనిషి అజ్ఞానం అని చెప్పాలి. కాస్త జటిలమైన అసలు విషయాన్ని గ్రహించే శక్తి లేనప్పుడు, మనిషి తనకు నచ్చిన వ్యాఖ్యానాలూ, ఉపాఖ్యానాలు అల్లుకుపోతాడు. అంతెందుకు? శివలింగం మీదికి ఉరితాడు విసురుతూన్న భయంకరాకారులు కొందరిని త్రిశూలం తరిమికొట్టి హతమార్చే దృశ్యాలతో ఉన్న క్యాలండర్ చిత్రాలను మీరు చూసే ఉంటారు, అవునా?" అన్నాడు దేవనాథుడు.

"అవును, తాతయ్యా! చూశాను. ఈ విషయం గురించి నేనే నిన్ను అడగాలనుకున్నాను. శివుడికి నమస్కరిస్తూ ఒక అందమైన అబ్బాయి ఉన్నట్టు కూడా ఆ చిత్రంలో వుంటుంది. ఆ సంగతి గురించి నేనెప్పుడూ వినలేదు. ఏమిటి అదంతా?" అని అడిగాడు సందీపుడు.

విశ్వావసు

ి - చరిత్ర



"ఆ దృశ్యం వెనక ఉన్న కథేంటి తాతయ్యా?" అని అడిగింది శ్యామల.

"ఆ దృశ్యం గురించి వివరించాలంటే ఆ కథ కూడా చెప్పాలి కదా?" అంటూ దేవనాథుడు ఇలా చెప్పసాగాడు :

అతి ప్రాచీనకాలంలో మృకండుడనే ముని ఉండేవాడు. ఆయనకు చాలాకాలం వరకు సంతానం కలగలేదు. ఆయన తన భార్య మనస్వినితో కలిసి సంతానం కావాలని రోజూ శివపూజ చేసేవాడు. శివుణ్ణి ఆరాధిస్తూ నిరంతరం శివధ్యానంతో గడిపేవాడు. ఆయనకు సంతానం లేకపోవడం అన్నది విధి నిర్ణయం. అయినా, కొన్ని నియమ నిబంధనలతో ఆయన కోరిక తీర్చే అవకాశం ఉన్నది. శివుడు ముని మనోనేత్రాల ముందు ప్రత్యక్షమై, "పూర్ణాయువుతో నూరేళ్ళు జీవించే వివేకహీనుడు సంతానంగా కావాలా? లేదా, పన్నెండేళ్ళు మాత్రమే సజీవుడుగా వుండే విద్యావివేకసంపన్నుడు కుమారుడుగా కావాలా?" అని అడిగాడు.

విద్యావివేకాలను గౌరవించి ఆరాధించే ముని కావడం వల్ల, మృకండుడు రెండవ వరాన్నే కోరుకున్నాడు.

కొన్నాళ్ళకు ఆయనకు కొడుకు పుట్టాడు. బిడ్డకు మార్కండేయుడని నామకరణం చేశారు. మార్కండేయుడు దినదినప్రవర్ధమానంగా పెరిగి అయిదేళ్ళ ప్రాయంలోనే అద్భుతమైన తెలివితేటలను ప్రదర్శించి పెద్దలకు ప్రీతిపాత్రుడయ్యాడు. ఎక్కడెక్కడి నుంచో మునిశ్రేష్ఠులు వచ్చి బాల మార్కండేయుడి విద్యావివేకాలకూ, వినయ విధేయతలకూ ముగ్ధులై మనసారా దీవించి వెళ్ళేవారు.



ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే వేదమంత్రాలను విడమరచి మునులకు విశదీకరించే మార్కండేయుడి ప్రతిభను చూసి అతని తల్లిదండ్రులు మురిసిపోయేవారు. విజ్ఞులయిన మునులు తమ బిడ్డను మెచ్చుకోవడం విని ఆనంద బాష్పాలు రాల్చేవారు.

అయితే, మార్కండేయుడికి పదేళ్ళు నిండేసరికి అతడి తల్లితండ్రుల వదనాలలో విషాదరేఖలు అలుముకోసాగాయి. కొడుకు రూపంలో మురిపిస్తున్న ఈ దివ్యాద్భుతం మరి రెండేళ్ళవరకే పరిమితం అన్న బాధ వారిని వేధించసాగింది.

మరికొన్నాళ్ళకు వారి బాధ ఆపుకోవాలన్నా ఆగలేదు. మౌనంగా కన్నీళ్ళు కార్చసాగారు. అయినా, అది తమ బిడ్డ కంటబడకుండా జాగ్రత్తపడ్డారు. మార్కండేయుడికి పన్నెం డేళ్ళు నిండడానికి ఇంకా కొన్ని నెలలే ఉన్నాయి. ఆ మునిదంపతులు తమ విధిని నిందిస్తూ భోరున విలపించసాగారు.

దానిని చూసిన మార్కండేయుడు తండ్రితో, "నాన్నా! మునిపుంగవులయిన తమరూ, ప్రశాంత స్వరూపురాలైన మా తల్లీ ఎందుకిలా విలపిస్తున్నారు? మీ శోకానికి కారణం ఏమిటి? దాచకుండా నాకు చెప్పండి మీ శోకకారణాన్ని తొల గించడానికి నా శాయశక్తులా ప్రయ త్నిస్తాను," అన్నాడు.



"దానిని పోగొట్ట లేవు, నాయనా! మా శోకానికి కారణమే నువ్వు!" అన్నాడు ముని దుఃఖాన్ని ఆపుకోవ డానికి ప్రయత్నిస్తూ.

"ఉత్తములైన తల్లిదండ్రులకు శోకం కలిగించేటంత పాపిష్టివాణ్ణా నేను!" అన్నాడు మార్కండేయుడు దిగ్భ్రాంతితో.

"సర్వసుగుణాలకృంతుడైన నీలాంటి ఉత్తమపుత్రుణ్ణి పోగొట్టుకుని క్షణమైనా బ్రతకగలమా?" అంటూ శివుడివరం గురించిన విషయాన్ని కుమారుడికి వివరించాడు మృకండుడు.

అంతా విన్న మార్కండేయుడు ఏమీ మాట్లాడలేదు. తీవ్రంగా ఆలోచించాడు. ఆ తరవాత ఎంతో ప్రియంగా, "ఇక మీరీ విషయం గురించి విచారించకండి. సమస్యను నాకు వదిలిపెట్టండి. నా విధిని నేనే నిర్ణయించు కుంటాను," అన్నాడు దృఢచిత్తంతో.

మార్కండేయుడు ఒంటరిగా హిమా లయాలలోని ఒక ప్రశాంత ప్రదేశానికి వెళ్ళి కూర్చుని ధ్యాన నిమగ్నుడయ్యాడు. మంచుకప్పిన కొండ లకు అభిముఖంగా కూర్చుని, ఏకాగ్ర చిత్తంతో శివుణ్ణి ధ్యానించసాగాడు. హృదయంలో శివ రూపాన్నీ, స్వభావాన్నీ నిలిపి, అకుంఠిత దీక్షతో ధ్యానాన్ని కొనసాగించాడు. కొన్నాళ్ళలో తనకూ, శివుడికీ మధ్య అంతరం లేని స్థితిని చేరుకున్నాడు. శివుడిలో మమేకం అయ్యాడు. శివం అంటే నిత్యం, శాశ్వతం, నిర్మలం, నిర్వికల్పం, నాశ రహితం! మార్కండేయుడు కాలానికి కట్టు బడిన జనన మరణాల బంధపాశాల నుంచి విముక్తుడయ్యాడు. నిశ్చల నిర్వికల్పస్థితిని చేరుకున్నాడు!

ఆ స్థితిలో ఉన్నప్పుడే అతడు భౌతికంగా పన్నెండేళ్ళు నిండిన ఘడియలను గడిపాడు. మరణకాలం ఆసన్నమయినప్పుడు మానవ దేహాలనుంచి ఆత్మలను వేరుచేసే అమానుష దివ్యశక్తులు – తమ బాధ్యత నెరవేర్చడానికి వచ్చాయి. కాని మార్కండేయుణ్ణి విడిగా గుర్తించలేకపోయాయి. ఎందుకంటే ప్రత్యేకంగా మార్కండేయుడంటూ లేడు. అతడు అఖండ శాశ్వత శివరూపంలో ఒకటై పోయాడు.

అమానుష దివ్యశక్తులు ఆ తరవాత తిరిగి వెళ్ళాయి!

మరణానికని నిర్దేశించిన క్షణాలు గడిచి పోవడంతో మార్కండేయుడు పునర్జన్మ ఎత్తినట్టు నూతన మానవుడయ్యాడు. ప్రగాఢ ధ్యానం నుంచి క్రమక్రమంగా బయటపడి నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

ఆ సమయంలో సప్తర్షులు అటు వెళు తున్నారు. మార్కండేయుడు అందరికీ భక్తితో నమస్కరించాడు. ఋషులు సంతోషించి, అతన్ని 'దీర్ఘాయుష్మాన్‌భవ' అని దీవించి వెళ్ళారు.

కథను ఆసక్తిగా వింటూన్న సందీపుడు, శ్యామల అక్కడినుంచి లేవలేదు. కాని స్నేహితులు కొందరు వస్తున్నారని తెలియ గానే, వెళ్ళి వారితో మాట్లాడాలని దేవనాథుడు లేచి నిలబడ్డాడు.

"మార్కండేయుడి చిత్రం ఎందుకలా ఉంటున్నదో ఇప్పుడు తెలిసింది కదా! అయినా శాశ్వతమూ, సత్యమూ అయిన పరమాత్మతో మమేకమై మరణాన్ని జయించే విధానాన్ని అంత సులభంగా అర్థం చేసు కోలేము. అందుకే ఆ మహోన్నత సూక్ష్మ సత్యానికి సజీవరూపం ఇవ్వడానికి, దానిని కొంచెం నాటకీయంగా చెప్పవలసివచ్చింది. కఠిన స్వభావులైన యమదూతలకూ, కరుణాస్వరూపుడైన పరమశివుడికీ మధ్య పోరాటం జరిగినట్టూ; శివుడు, యమదూత లను హతమార్చి తన భక్తుడికి చిరాయువు ప్రసాదించినట్టూ మరిచిపోలేని ఆసక్తి కరమైన కథ ప్రచారంలోకి వచ్చింది. అర్థమయిందా?" అన్నాడు దేవనాథుడు.

"అర్థమయింది!" అన్నారు అన్నా చెల్లెళ్ళు ఆనందంగా. – (ఇంకావుంది)





# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

1



1. (ఎ) దేశం నాలుగు దిశలలోనూ, ఈనాటికీ నడుస్తూన్న నాలుగు మఠాలను వందలాది సంవత్సరాలకు పూర్వం స్థాపించిన మతాచార్యుడు ఎవరు?

(బి) పొరుగురాజ్యంపై దండెత్తివెళ్ళి జయించినప్పటికీ, యుద్ధానంతర భీకర దృశ్యాలను చూసి, మనసు చలించి అహింసామార్గాన్ని అవలంబించి, అహింసా సిద్ధాంత వ్యాప్తికి జీవితాంతం కృషి చేసిన రాజు ఎవరు?

(సి) భక్త కవయిత్రి - గాయకురాలుగా మారి రాజ్యాన్ని వదలివెళ్ళి, దూరప్రాంత ఆలయంలో నిగూఢంగా కనుమరుగైపోయిన రాణి ఎవరు?

(డి) నాలుగు వేదాలలో, వైద్యశాస్త్రానికి సంబంధించిన విషయాలువున్న వేదం ఏది?

(ఇ) రాజయోగ సూత్రాలను రచించిన ముని ఎవరు?

2

ఆ యువరాణి అద్భుత సౌందర్యరాశి. ఆమె తండ్రి ఆమెకు తగిన వరుడి కోసం అన్వేషిస్తూన్న సమయంలో - ఇరుగు పొరుగు రాజ్యాలకు చెందిన ఇద్దరు రాజకుమారులు ఆమెను వివాహమాడడానికి పోటీపడ్డారు. ఇద్దరూ కూడా రాజుకన్నా బలవంతులే. కుమార్తెనివ్వడానికి అంగీకరించకపోతే, రాజ్యంపై దండెత్తిరాగలమని ఇద్దరూ రాజును హెచ్చరించారు. మరి కొన్నాళ్ళకు రెండువైపులనుంచీ సైన్యం వస్తున్నట్టు రాజుకు వార్త అందింది. రాజుకు ఏం చేయడానికీ తోచలేదు. యువరాణిని చంపడమే సమస్యకు పరిష్కారం అని కొందరు సలహా ఇచ్చారు. అయితే రాజు అందుకు అంగీకరించలేదు. తండ్రి సందిగ్ధావస్థను చూసి భరించలేక యువరాణి విషం తాగి మరణించింది!

ఆ యువరాణి ఎవరు? ఆమె ఏ రాజ్యానికి చెందినది? ఆమెను వివాహమాడడానికి పోటీపడిన రాజకుమారులు ఎవరు?



56. భీముడి విజృంభణ

# మహాభారతం

పాండవులను గురించి ధృతరాష్ట్రుడు అన్న మాటకు సంజయుడు, "రాజా, పాండవుల వద్ద మంత్రాలూ, మాయలూ ఏమీ లేవు. వాళ్ళు యుద్ధంలో తమ శక్తి చూపుతున్నారు. వాళ్ళ ధర్మమే వాళ్ళకు యుద్ధంలో జయం కలిగిస్తున్నది. నీ కొడుకులు చేసిన దుష్కర్మలు విషవృక్షమై వారిని నాశనం చేస్తున్నాయి. నీకు ఎంతమంది హితం చెప్పలేదు? నువ్వు మాత్రం విన్నావా? విదురుడూ, భీష్మద్రోణులూ నేనూ ఎంతో చెప్పాం. నీకవి ఏ మాత్రమూ రుచించలేదు. ఇప్పుడు నువ్వు నన్నడిగినట్టే, శిబిరంలో రాత్రివేళ దుర్యోధనుడు భీష్ముణ్ణి కూడా అడిగాడు," అంటూ జరిగినదంతా తెలిపాడు :

"తాతా! నువ్వూ, ద్రోణుడూ, కృపుడూ, ఇతర మహారథులూ నా కోసం ప్రాణాలొడ్డి పోరుతున్నా కూడా పాండవుల ముందు నిలవలేకుండా ఉన్నారు. అందుకు కారణం ఏమిటి?" అని దుర్యోధనుడు భీష్ముణ్ణి అడిగాడు.

దానికి భీష్ముడు, "నాయనా, నీకు చాలా సార్లు చెప్పాను, మళ్ళా చెబుతున్నాను. పాండవులతో సంధిచేసుకో. నువ్వూ, నీ తమ్ములూ సుఖంగా ఉండండి. కృష్ణుడు





పాండవులకు అండగా ఉండగా వారెనెవరూ చంపలేరు,'' అని అతనికి విశ్వోపాఖ్యానం ఇలా చెప్పాడు:

ఒకసారి బ్రహ్మదేవుడు గంధమాదన పర్వతం మీద కూర్చుని ఉండగా దేవతలూ, ఋషులూ వచ్చి ఆయన చుట్టూ చేరారు. ఆ సమయంలో ఆకాశంలో కాంతివంతమైన విమానం ఒకటి వారికి కనిపించింది. బ్రహ్మ దాన్ని చూసి చేతులు జోడించి ధ్యానించాడు. అది చూసి దేవతలూ, ఋషులూ, లేచి నిలబడి నమస్కారాలు చేశారు.

బ్రహ్మ ఆ విమానాన్ని స్తుతించి, ''దేవ దేవా, నీ అంశను పంపి, యదువంశంలో జన్మింపజెయ్యి,'' అని అడిగాడు.

''నీ కోరిక గ్రహించాను. అలాగే చేస్తాను,'' అన్న జవాబు వినిపించింది. దేవతలూ, ఋషులూ ఆశ్చర్యపోయి చూస్తూన్నంతలో విమానం అంతర్థానమయింది.

అప్పుడు దేవతలూ, ఋషులూ బ్రహ్మను, ''పితామహా, నువ్వు ప్రార్థించినది ఎవరిని? దేనికి ప్రార్థించావు?'' అని అడిగారు.

దానికి బ్రహ్మ ''ఆయన మహావిష్ణువు. పూర్వం చచ్చిపోయిన దైత్యులూ, దానవులూ, రాక్షసులూ తిరిగి భూమి మీద జన్మించారు. వారిని చంపటానికి నరుడితో బాటు, నారాయణుడు కూడా మానవుడుగా పుట్టాలి. వారి వెంట దేవతలు కూడా పుట్టుతారు. వారిని ఎవరూ జయించలేరు. మూఢులు ఈ సంగతి తెలుసుకోలేరు,'' అన్నాడు.

భీష్ముడీ కథ చెప్పి దుర్యోధనుడితో, ''నువ్వు ఒక క్రూర రాక్షసుడివై ఉండాలి. అందుకే కృష్ణార్జునులతో వైరం పెట్టుకున్నావు,'' అన్నాడు. తరవాత ఎవరి శిబిరాలకు వారు వెళ్ళి నిద్రపోయారు.

యుద్ధం అయిదో రోజు తెల్లవారింది. ఉభయసేనలూ వ్యూహాలు పన్ని యుద్ధానికి సిద్ధమయ్యాయి. కౌరవులది మకరవ్యూహం, పాండవులది డేగవ్యూహం. ఆ వ్యూహానికి ముందు భీముడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ నిలబడ్డారు. వారికివెనకగా సాత్యకీ, అర్జునుడూ ఉన్నారు.

దుర్యోధనుడు ద్రోణుడితో, '' ఇవాళ పాండవులు చచ్చిపోయేటట్టు చూడు,'' అని చెప్పాడు. ఈ మాట వింటూనే ద్రోణుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకికి తోడుగా భీముడూ, ద్రోణుడికి తోడుగా భీష్మ, శల్యులూ వచ్చి యుద్ధం చేశారు. భీష్మ, ద్రోణులు చేసే దారుణయుద్ధాన్ని ఎదుర్కొనే

టందుకు అభిమన్యుడూ, ఉపపాండవులూ, శిఖండీ వచ్చారు. శిఖండితో భీష్ముడు యుద్ధం చెయ్యలేదు. ద్రోణుడు శిఖండిని భయంకరంగా ఎదుర్కొనేసరికి, శిఖండి నిలవలేక తప్పుకుని వెళ్ళాడు. అప్పుడు పాండవుల వెంట అర్జునుడు వచ్చి భీష్ముడిపై తలపడ్డాడు. ఇద్దరూ పట్టుదలతో యుద్ధం చేశారు. అదే సమయంలోఉభయపక్షాల వీరులూ విజృంభించి యుద్ధంచేశారు. ఆ యుద్ధంలో సేనలు అపారంగా నష్టమయ్యాయి.

ఈ అయిదోరోజు యుద్ధంలో ముఖ్యంగా చెప్పుకోదగిన ఘట్టాలేవంటే : అశ్వత్థామకూ అర్జునుడికీ జరిగిన యుద్ధంలో అర్జునుడు అశ్వత్థామ ధరించినకవచాన్ని తనబాణాలతో ఛేదించాడు. దాన్ని అశ్వత్థామ లక్ష్యపెట్టక సాహసంతో పోరసాగాడు, కాని అర్జునుడు అశ్వత్థామ గురుపుత్రుడని అతన్ని వదిలేసి ఇతర శత్రువులను వెతుక్కుంటూ వెళ్లాడు. దుర్యోధనుడికీ, భీముడికీ ఈ రోజు గొప్ప యుద్ధం జరిగింది. అభిమన్యుడు లక్ష్మణ కుమారుడితో చేసిన యుద్ధంలో కృపుడు లక్ష్మణ కుమారుణ్ణి రక్షించి, అవతలికి తీసుకుపోయాడు.

ఆ రోజు సాత్యకి విజృంభించి కౌరవ సేనలను బీభత్సం చేస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు అతని పైకి అనేక రథాలను పంపాడు. సాత్యకి అస్త్రాలతో ఆ రథికు లందరినీ నానా తిప్పలూ పెట్టుతూ, ఆ సేనకు నాయకుడైన భూరిశ్రవుడి పైకి వచ్చాడు. భూరిశ్రవుడు గొప్పయోధుడు. ఆయన చేసే యుద్ధానికి తట్టుకోలేక, సాత్యకికి అండగా ఉన్న యోధులందరూ చెల్లాచెదరుగా



పారిపోయారు. అప్పుడు సాత్యకి కొడుకులు వచ్చి భూరిశ్రవుణ్ణి చుట్టుముట్టి, భూరిశ్రవుడి చేతిలో చావుదెబ్బలు తిన్నారు. వారు పడి పోవటం చూసి సాత్యకి కోపోద్రేకంతో భూరిశ్రవుడితో ద్వంద్వయుద్ధం సాగించాడు. ఇద్దరి రథాలూ ధ్వంసమయ్యాయి. వారు కత్తులు తీసుకుని నేలపై నిలబడ్డారు. ఆ సమయంలో భీముడు వచ్చి సాత్యకిని తన రథంలోకి తీసుకున్నాడు. అలాగే భూరిశ్రవుణ్ణి దుర్యోధనుడు తన రథంలో తీసుకు పోయాడు. సూర్యాస్తమయం అయ్యే సమయానికి రెండు పక్షాల సేనలూ అలిసి పోయి,యుద్ధం చాలించి శిబిరాలకువెళ్ళాయి.

ఆరోరోజు తెల్లవారగానే యుద్ధం ప్రారంభమయింది. పాండవసేనలు మకరవ్యూహమూ, కౌరవసేనలు క్రౌంచవ్యూహమూ ధరించాయి.



కాని ఈ వ్యూహాలు భగ్నం కావటానికి ఎంతో సేపు పట్టలేదు. ఆరంభంలోనే భీముడికీ, ద్రోణుడికీ పడింది. ద్రోణుడు భీముణ్ణి బాణాలతో తీవ్రంగా కొట్టాడు. భీముడు మండిపడి ద్రోణుడి సారథిని చంపాడు. ద్రోణుడు తన రథాన్ని తానే నడుపుకుంటూ యుద్ధం చేసి, పాండవసేనలను చిందరవందర చేసేశాడు. ఇందులో భీష్ముడు ద్రోణుడికి తోడయ్యాడు. అదే విధంగా భీమార్జునులు కౌరవసేనా వ్యూహాన్ని ఛిన్నాభిన్నం చేశారు.

భీముడు భీష్ముణ్ణి లెక్క చెయ్యక, ధృతరాష్ట్రుడి కొడుకులను చంపే నిశ్చయంతో కౌరవసేన ప్రవేశించాడు. వాళ్ళు అతన్ని ప్రాణాలతో పట్టుకోవాలనుకుని చుట్టుముట్టారు. భీముడది గమనించి, గదతీసుకుని రథం నుంచి కిందికి దూకి, తన చుట్టూ ఉన్న కౌరవసేనను ఆవేశంతో నిర్మూలించ సాగాడు. ద్రోణుడితో యుద్ధం చేస్తున్న ధృష్టద్యుమ్నుడు దూరంగా ఉన్న భీముడి రథం చూసి, ద్రోణుణ్ణి విడిచి భీముడి రథాన్ని చేరవచ్చి, రథం ఖాళీగా ఉండటం చూసి, సారథిని, ''భీముడేమయ్యాడు?'' అని అడిగాడు.

దానికి సారథి విశోకుడు, ''రాజా, నన్ను రెండు గడియలు ఇక్కడే ఉండమని భీముడు కౌరవసైన్యంలో జొరబడ్డాడు,'' అన్నాడు. భీముడికి అపాయం కలుగుతుందని శంకించి ధృష్టద్యుమ్నుడు తాను కూడా అతని మార్గానే బయలు దేరాడు. కొంత దూరం వెళ్ళేసరికి, భీముడు దారిలో అడ్డమైన ఏనుగులనూ, సైనికులనూ, చంపుతూ ధృష్టద్యుమ్నుడికి కనిపించాడు. అంతలోనే కౌరవయోధులు భీముణ్ణి చుట్టుముట్టి, అతని మీద బాణవర్షం కురిపించారు. ధృష్టద్యుమ్నుడు వచ్చి చేరేసరికి, భీముడు ఒళ్ళంతా నెత్తుర్లు కారుతూ కూడా మృత్యుదేవతలాగా కనిపించాడు. ధృష్టద్యుమ్నుడు అతన్ని తన రథం మీద ఎక్కించుకుని, అతని శరీరంలో గుచ్చుకున్న బాణాలన్నీ పెరికి, కౌగలించుకున్నాడు.

ఈ లోపల ధృతరాష్ట్రుడి కొడుకులు భీముణ్ణీ, ధృష్టద్యుమ్నుణ్ణీ కూడా ఒకే దెబ్బతో చంపెయ్యాలని వచ్చి పడ్డారు. వారి బాణాల వర్షంలో మునిగి కూడా ధృష్టద్యుమ్నుడు చలించక, వారినందరినీ సమ్మోహనాస్త్రంతో మూర్ఛపోగొట్టాడు. అంతలో ద్రోణుడు వచ్చి ప్రజ్ఞాస్త్రం ప్రయోగించి, మూర్ఛపోయిన వారందరినీ లేవగొట్టాడు.

ఇంతలో ధర్మరాజు భీమధృష్టద్యుమ్నులు ఏమైనదీ తెలియక అభిమన్యుడు మొదలైన పన్నెండు మంది యోధులను పంపాడు. వారిని చూడగానే భీమ, ధృష్టద్యుమ్నులు మరింత ఉత్సాహంగా యుద్ధం చెయ్య సాగారు. అంతలో ధృష్టద్యుమ్నుడికి, తన తండ్రి ద్రుపదుడు ద్రోణుడి దెబ్బకు తట్టుకోలేక పారిపోవటం కనిపించింది. అతను ద్రోణుడితో తలపడి, తన రథాన్నీ, సారథినీ కోల్పోయి, వేగంగా అభిమన్యుడి రథం ఎక్కాడు. ద్రోణుడు పాండవసేనలను అల్లకల్లోలం చేస్తుంటే భీముడూ, ధృష్టద్యుమ్నుడూ ఏమీ చేయలేకపోయారు. ద్రోణుడి పరాక్రమాన్ని ఉభయసేనలూ మెచ్చుకున్నాయి. భీముణ్ణి పట్టుకునే ఆలోచన దుర్యోధనాదులకు మళ్ళీ వచ్చింది. కాని, ధర్మరాజు పంపిన అభిమన్యుడు మొదలైన వారు వాళ్ళను తరిమేశారు.

యుద్ధరంగం దక్షిణ పార్శ్వంలో అర్జునుడు విజృంభించి అంతులేని శత్రుసేనలను నిర్మూలించాడు.

సూర్యుడు పడమటికి దిగుతూ ఉండగా దుర్యోధనుడికి భీముణ్ణి చంపాలని తీవ్రమైన కోరిక పుట్టింది. అతను భీముణ్ణి ఎదుర్కొని, భీముడి చేత తన గొడుగూ, ధ్వజమూ విరగ గొట్టించుకుని, చివరకు చావుదెబ్బలు తిని, కృపుడి రథంలో విశ్రాంతి తీసుకున్నాడు. అప్పుడు ధృష్టకేతువూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, కేకయులూ ధృతరాష్ట్రుడి కొడుకుల మీద యుద్ధం సాగించారు. ఉభయ పక్షవీరుల మధ్య జరిగిన యుద్ధంలో దుష్కర్ణుడు అనేవాడు చచ్చాడు.

కొంతసేపటికి సూర్యుడు అస్తమించాడు. రెండు సేనలూ శాంతించాయి. యుద్ధం చాలించి దుర్యోధనుడు తమ శిబిరానికి తిరిగి వెళ్ళాడు. ధర్మరాజు భీముణ్ణీ, ధృష్టద్యుమ్నుణ్ణీ



సంతోషంతో కౌగలించుకుని తానుకూడా తమ శిబిరానికి తిరిగి వెళ్ళాడు.

కొంత విశ్రాంతి తీసుకున్న తరవాత దుర్యోధనుడు భీష్ముడితో, "తాతా, మనం ఎంత అభేద్యమైన వ్యూహాలను పన్నినా పాండవులు వాటిని భగ్నం చేసి, విజృంభిస్తున్నారు. భీముడు ఇవాళ మన క్రౌంచ వ్యూహంలో సులభంగా జొరబడి, నన్ను ఓడించాడు. వాడి భయంకరాకారం చూసి నేను మూర్ఛపోయాను. నా మనసు ఆందోళన పడుతున్నది. నీ అనుగ్రహంతో పాండవులను చంపి, జయం పొందుదామని నా ఆశ," అన్నాడు.

దానికి భీష్ముడు, "నాయనా, నీకు జయం కలగాలని నేను శాయశక్తులా పాటుపడుతున్నాను. ఏమాత్రమూ ఒళ్ళుదాచుకోవటం లేదు. పాండవుల పక్షాన పోరుతున్న వాళ్ళు శూరులూ, మహారథులూ, అస్త్రవేత్తలూనూ. అన్నిటికీ తెగించిపోరాడుతున్న ఆ వీరులను సులభంగా జయించటం సాధ్యపడదు. నేను నా ప్రాణాలను లక్ష్యపెట్టకుండా నీ కోసం యుద్ధం చేస్తున్నాను. నీ కోసం అవసరమైతే మూడు లోకాలనూ భస్మం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. ఎలాంటి విచారమూ పెట్టుకోకు," అన్నాడు.

ఈ మాట విని దుర్యోధనుడు చాలా సంతోషించాడు.

భీష్ముడు కొంచెం ఆలోచించి, దుర్యోధనుడితో మళ్ళీ ఇలా అన్నాడు:

"నీ కోసం పోరాడటానికి ఉత్సాహపడుతున్న వారిలో నేను గాక, ద్రోణుడూ, శల్యుడూ, కృతవర్మా, అశ్వత్థామా, సోమదత్తుడూ, సైంధవుడూ, విందానువిందులూ, బాహ్లికుడూ, బృహద్బలుడూ, చిత్రసేనుడూ, వివింశతీ మొదలైన మహావీరులూ, అనేకవేల రథయోధులూ, గజ, అశ్వబలాలూ సిద్ధంగా ఉన్నాయి. వీరందరూ దేవతలనైనా జయించ గలవాళ్ళే. అయితే నీ హితం కోరి ఒకమాట చెప్పాలి; ఇంద్రుడితో దేవతలంతా కదిలి వచ్చినా పాండవులను జయించలేరు. అందుచేత పాండవులే నన్ను జయిస్తారో, నేనే పాండవులను జయిస్తానో చెప్పటం నాకు సాధ్యం కాదు."

ఈ మాట చెప్పి భీష్ముడు, దుర్యోధనుడి శరీరానికి తగిలిన గాయాలు మానటానికి విశల్యకరణి అనే మందు ఇచ్చాడు.





# పట్టినది బంగారం

ఒక వర్తకుడికొక కొడుకుండేవాడు. వర్తకుడి భార్య చిన్నతనంలోనే పోయింది. అందుచేత ఆయన ఒక్కగానొక్క కొడుకును చాలా గారాబంగా పెంచి, వాడికోసం బంగారాన్ని రెండు చేతులా ఆర్జించి, వాడి సుఖం కోసం దాన్నీ మంచినీళ్ళ లాగా ఖర్చు చేస్తూవచ్చాడు.

తన కొడుకు సుఖం తప్ప ఆ మానవుడికి మరొక ఆలోచనే ఉండేది కాదు.

కొంత కాలానికి వర్తకుడు మంచాన పడ్డాడు. చావు దగ్గిర పడినట్టు తెలుసుకుని ఆయన ఒకనాడు తన కొడుకును పిలిచి, "బాబూ, నువ్వు మట్టి పట్టితే అది బంగారం కావాలని ఆఖరు ఘడియలో నిన్ను మన స్ఫూర్తిగా దీవిస్తున్నాను," అంటూ ప్రాణాలు వదిలాడు.

వర్తకుడి కొడుకు తండ్రి కోసం కొన్ని వారాలపాటు శోకించి ఆ శోకం ఉపశమించాక, తండ్రిలాగే వర్తకంలోకి దిగాడు. తండ్రికి లాగే కొడుక్కు కూడా వ్యాపారం అమితంగా కలిసి వచ్చి కనకవర్షం కురిసింది.

కొంతకాలం ఇలా ఎడాపెడా ధనం సంపాదించాక కుర్రవాడికి తన తండ్రి చేసిన ఆఖరు ఆశీర్వచనం జ్ఞాపకం వచ్చింది. ఆయన నోటిచలవ చేతనే తనకిలా వద్దంటే డబ్బు వచ్చిపడుతున్నదనుకుని, "అదృష్టం ఇలా కలిసిరావటం అపాయకరం, దీనికి ఇప్పుడే ఏదన్నా విరుగుడు చూడాలి," అనుకున్నాడు వాడు.

తన అదృష్టానికి కళ్ళెం వేసే ఉద్దేశంతో వాడు తీవ్రంగా ఆలోచించాడు. వర్తకపు సరుకులను హెచ్చుధర ఉండే ప్రాంతంలో కొని తక్కువ ధర ఉండే ప్రాంతంలో అమ్మ టానికి నిశ్చయించాడు. అది అంత వివేక మంతమైన పని కాదని మిత్రులూ, పెద్దలూ వారిస్తున్నా అతడు వినిపించుకోలేదు.

అనుకున్న ప్రకారం వాడు తమదేశంలో చాలా గిరాకీగా ఉండే చోట ఖర్జూరాలు కొని, వాటిని ఈజిప్టు దేశంలో అమ్మటానికి తీసుకుపోయాడు. ఆ దేశంలో ఖర్జూరాలు కారుచవుక.

[అగస్ట్ సంచికలో వెలువడిన 'రంగడి కథ' రచన "వసుంధర"]

ఆ వింత వర్తకుడి ప్రవర్తనను అందరూ విడ్డూరంగా చెప్పుకోసాగారు. ఎవడో వర్తకుడు ఎక్కడి నుంచో ఖర్జూరాలు తెచ్చి తన దేశంలో అమ్ముతున్నట్టు ఈజిప్టు రాజుకు తెలిసింది. ఆయన తన ఉద్యోగులతో, "ఎవరీ వింత వర్తకుడు?" అన్నాడు. ఉద్యోగులు వాడిని గురించి చెప్పారు.

"అయితే నేనే వాడిని చూస్తాను," అంటూ రాజు పరివారంతో బయలుదేరాడు. రాజోద్యోగులు రాజును కుర్రవాడి వద్దకు తీసుకుపోయారు. "ఎక్కడినుంచో వచ్చి ఇలా ఈ మతిలేని వ్యాపారం చేసి వున్నదంతా ఎందుకు తగలేసుకుంటున్నావు?" అని రాజు యువకుణ్ణి అడిగాడు.

"మహారాజా, మా నాన్న ఆశీర్వాదం చేత నేను ఎంత నిర్లక్ష్యంగా వర్తకం చేసినా కనకవర్షం కురుస్తున్నది. అదృష్టం అంతగా కలిసిరావటం మంచిది కాదని దానికి విఘ్నం కలిగించే ప్రయత్నంలో ఉన్నాను," అన్నాడు యువకుడు.

"మీ తండ్రి ఏమని ఆశీర్వదించాడు?" అని రాజు అడిగాడు.

"ఇలా మట్టి తీసుకుంటే బంగారమవుతుందని మా నాన్న చనిపోతూ నన్ను ఆశీర్వదించాడు," అంటూ ఆ కుర్రవాడు నేలకు వంగి, పిడికెడు మన్ను తీసి కిందకి జారవిడిచాడు.

మన్ను చేతినుంచి రాలిపోగా యువకుడి చేతిలో ఏదో దిగబడింది.

"ఏమిటది?" అని అడిగాడు రాజు ఆశ్చర్యంతో.

"ఏదో ముద్రిక లాగుంది," అంటూ ఆ యువకుడు దాన్ని రాజు చేతిలో పెట్టాడు.

అది ఆ రాజుగారి ముద్రికే. ఏడాది క్రితం అది ఎక్కడో పోయింది. దానిపైన గల అభిమానం కొద్దీ రాజు ఎంతో ధనం వ్యయం చేసి ఆ ముద్రిక కోసం వెతికించాడు. కానీ ప్రయోజనం లేకపోయింది.

"నిజంగా మీ తండ్రి ఆశీర్వచనం అమోఘం. నీ అదృష్టాన్ని మార్చటం దేవుడి తరం కూడా కాదు," అని రాజు, ఆ కుర్రవాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేశాడు. తరవాత ఆ కుర్రవాడే ఈజిప్టుకు రాజు కూడా అయ్యాడు.



# ఫోటో
## వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ,
వడపళని,
చెన్నయ్-600026.





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీ లోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు నవంబర్ 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.






జూలై 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
పెంటకోట ఆదినారాయణ
C/o. బంగ్లా, మునగపాక
విశాఖజిల్లా - 531033 (ఆం.ప్ర)



మొదటి ఫోటో: అడ్డుదారి అపాయం!

రెండవ ఫోటో: ఆలోచించు ఉపాయం!

